శ్రీపరబ్రహ్మణేనమః S. No. (

# భక్తవిజయమను

# పతివ్రతాచరిత్రలు

మొదటి భాగము.

ఇందు స్త్రీలకు, బాలికలకు అత్యంతోపయోగ మగునట్లు వ్రాయబడినవి.

రాజమండ్రి బుక్‌సెల్లర్సు,

## కర్రా అచ్చయ్యా అండ్ సన్సు వారిచే

ప్రకటింపబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

TITLE PAGE PRINTED AT:

**CROWN PRESS,**

**RAJAHMUNDRY.**

**1924.**

 [Price As. 8.]




శ్రీపరబ్రహ్మణేనమః

# భక్తవిజయమను

# పతివ్రతాచరిత్రము

—:○:0:○:—

మొదటిభాగము.

ఇండ్లస్త్రీలకు, బాలికలకు అత్యంతోపయోగమగునట్లు వ్రాయబడినవి.

రాజమండ్రి బుక్కు సెల్లర్సు,

కర్రా అచ్చయ్య అండ్ సన్సువారిచే

ప్రకటింపబడియె.




శ్రీ సుజనరంజనీముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

రాజమహేంద్రవరము.

 [వెల 8 అణాలు

1924

శ్రీ రామకృష్ణపరబ్రహ్మణేనమః

# విషయసూచిక.

# తొలి పలుకు.

చదువరులారా!

ప్రాచీనకవిపుంగవులచే వచనకావ్యములోను పద్యకావ్యములోను వ్రాయబడిన మహాపతివ్రతల కథలనేకములు గలవు. ఆయా పతివ్రతల ప్రభావములను మహాత్మ్యములనేను బాగుగ చదివి యా దిరువది కథలనెత్తి భక్తివిజయమను పతివ్రతాచరిత్రలు అను నామంబున నీపొత్తము వ్రాసితిని. రెండవభాగము గూడ కొద్దికాలములో వ్రాయుచున్నాడను. గావున ఆంధ్రులెల్లరు, ముఖ్యముగా స్త్రీలు, బాలికలు యీపుస్తకము నొకదానిని కొని, సర్వకాలసర్వావస్థలయందు తమ వద్దనుంచుకొని, తీరికగానున్నప్పు డెల్లను నొక్కొక్క కథను శ్రద్ధతో జదువుకొని, యందలి సారస్యమును గ్రహించి, పూర్వపుస్త్రీలు యెట్టికష్టముల పాలైరో, యట్లు పతినే దైవముగా నెంచి, పతి కష్టములే తమకష్టములుగా దలంచి, ఎవ్విధమున శాశ్వతైశ్వర్యపదవి నందిరో దెలిసికొని మీరు గూడ నట్లొనర్చుటకు ప్రయత్నించెదరని నాకోరిక. సతీపతులిరువురును గలసిమెలసి యున్న యాసంసారమే స్వర్గమనియు వారు నిత్యమును పోరాడిన యాసంసారమే నరకమనియు మీ రెరుంగనిది కాదు. గావున భార్య యెల్లప్పుడు భర్తనే దైవంబుగ దలంచవలయును అనుమాటలీ కథలు జదివినచో తప్పక దెలియును.

పతివ్రతాశిరోమణుల కథలిందు సులభ శైలిని, సాధారణ విద్యాజ్ఞానముగల స్త్రీలకు బాలికలకు నితరుల సహాయ మక్కర లేకుండగనే యర్థము జేసుకొనులాగున, చదివినకొలది భక్తియెక్కు వగునటుల, క్రూరమనస్కులగు స్త్రీలు సన్మార్గమునకు వచ్చునట్లుగా, పతిభక్తి హెచ్చునట్లుగా, మంచినడవడిక లబ్బునట్లుగా బుద్ధికుశలత హెచ్చునట్లుగా నన్నీ పుస్తకమును వ్రాయుడని హెచ్చరికజేసి నేనట్లు వ్రాసి యిచ్చిన వెంటనే యచ్చువేయించి ప్రచురింపజేసిన కర్రా అచ్చయ్య అండు సన్సువార్కి నాకృతజ్ఞతను దెలుపుచు నీ తొలి పలుకు విరమించెదను. ప్రతివారును గొనులాగున వెలసులభముగా నుంచవలసినది, వెలసులభమైనను ఫలమధికము.

ఇట్లు

కొండ్రెడ్డి సూర్యప్రకాశం

—+—+·⊙·+—+—

శ్రీపరబ్రహ్మణేనమః

# దమయంతీదేవి చరిత్రము



పూర్వము వీరసేనుడను మహారాజు నిషధరాజ్యమును పరిపాలించుచుండెను. ఆయనకు నలుండను కుమారుడు గలడు. అతడు మిక్కిలి సౌందర్యవంతుడును సుగుణాతిశయుండునునై విలసిల్లుచుండెను. మరియు భీమరాజను మరియొక పరాక్రమశాలి విదర్భదేశము నేలుచుండెను. ఆయనకు సంతానము లేక గొప్పతపస్సు చేయగా దమనుడను మహాముని వరంబున దమయంతి యను కుమారీరత్నమును, దముడు, దాంతుడు, దమనుడు అనుపుత్రులును జన్మించిరి. దమయంతి రూపలావణ్యములచే నతిశయిల్లి దేవకన్నియలను మీఱియుండెను. లోకులు దమయంతిని గుఱించియు నలమహారాజును గుఱించియు బహువిధముల గొనియాడుచుండెడువారు. ఇట్లుండగా నొక్కనాడు, నలమహారాజు తన యుద్యానవనమున విహరించుచు దమయంతియందు మోహావేశమున దగిలియుండెను.

అంతట యొకహంసలగుంపు వాని చెంతను వ్రాలి వాని మనంబునకు మిక్కిలి సంతోషమును గూర్చెను. ఆ హంసలను నలుడు పట్టుకొనుటకు ప్రయత్నించగా నొక్కరాజహంస మాత్రము వానికి చిక్కెను. నలుడు దానిని విడువకుండగా, హంస నలుని జూచి రాజా! నన్ను విడువుము నీవు వరించియున్న దమయంతి యొద్దకు బోయి యామెకు నీయందు ప్రేమపుట్టించి నిన్ను పరిణయంబాడునటుల జేసెదను. అంతట రాజు విడువగా నది తోడిహంసంబులతో విదర్భాపట్టణంబునకు బోయి యుద్యానవనమధ్యమున విహరించుచుండి

నట్టియు నలుని యందు మిక్కిలి యనురాగముచే పరితపించు నట్టియు దమయంతిచేతికి జిక్కి యామెతో నిట్లనియె. ఓ నారీరత్నమా ! నేను చూచిన రాజపుంగవులందరిలో నలమహారాజు ఘనుడు. వానిని బోలి నసుగుణ గణ్యుడు మరియెందును లేడు. కావున వానిని తప్పక పెండ్లి యాడుమని మృదుమధుర వచనములచే నామెను హెచ్చరించెను.

తరువాత కొన్నిదినములకు దమయంతి, నిద్రాహారములు మాని శేయింబవళ్ళు నలమహారాజు మీదనే మనస్సు నిల్పి యుండుట నామెతల్లిదండ్రులు గ్రహించి, ఆమెకుస్వయంవరమును గావింప నిశ్చ యించి పండితోత్తములచే సుముహూర్తము నిర్ణయించి వివిధదేశ ములరాజులందరికి ప్రచురపత్రికల నంపెను. ఇట్లుండగా దేవేంద్రాదు లుకూడ నీదమయంతియొక్క చక్కదనమును గూర్చి నారదుని వలన విని మోహావేశపరవశులై విమానారూఢులై భూమండలమునకు విచ్చే యుచుండిరి .నలుడు, తక్కిన రాజులవలెనే తానును స్వయంవరము నకు వచ్చుచుండగా దేవతలు వానిని గాంచి రాజా నీవాడితప్పని వాడవు. సచ్చరిత్రుడవు. మాకొక్క మేలు గావింపవలెను. అది యెద్ది యనిన దమయంతి యొద్దకుబోయి మాలోనొక్కని వరియింపజేయుట యె మా యభిమతము అని పలికెను. నలుడు మారుబల్కలేక సుర వరులారా ! దుస్తరమైన రాజమందిరము నే నెట్లు ప్రవేశింపగలను. అని పల్కెను.

అంతట దేవతలు వాని కదృశ్యగుళికను ప్రసాదించిరి. దానిని స్వీకరించి నలుడు ,దమయంతి యున్న యంతిపురమును జొచ్చి ఆమెను, దేవతలును వరించినట్లు బహువిధముల హెచ్చరించెను. కాని దాని కామెయొడంబడక స్వయంవరకాలమందు నేనొక యుపాయము జేసి నిన్నే వరించెదను. నీవే నా పతివి, అని ప్రతివచనం బిచ్చెను. నలుడు దేవతలకు ఆవృత్తాంతమును తేటపరచెను. పిదప స్వయంవర

కాలమందు సభామంటపమున దేవతలు నలుగురును నలుని యొక్క స్వరూపములను దాల్చిరి. దమయంతికి గుర్తింప నసాధ్యమగునటుల గావించిరి. నిజమయిన నలమహారా జెవ్వరో తెలియక దమయంతి చింతాక్రాంత చిత్తయై తన యిష్టదైవంబులను దేవతలను ప్రార్థింప ఆమె పార్థన నంగీకరించి నిజరూపమును ధరించిరి.

నలునకును దమయంతికిని మహావైభవమున వివాహము జరిగి దేవతలెల్లరు వారికి వరంబులు ప్రసాదించిరి. నలుడు దమయంతీ సమేతుడై నిజపురంబునకు బోయెను. కలిపురుషుడు దమయంతీ స్వయంవరమును గూర్చి దేవతలవలన విని మనంబున మహాక్రోధంబు వహించి యెట్లయినను దమయంతికిని నలునకును వియోగమును, రాజ్యభ్రష్టత్వమును, గావించెదనని నిశ్చయించి యొక్కనాడు నలుండు సంధ్యాకాలంబున అశుచియై యుండుట గ్రహించి వాని నావేశించి వాని పిన్నతండ్రి కుమారుడగు పుష్కరునకు తన యుద్యమంబు తెలిపి మాయాజూదము నొక దానిని గల్పించి తదీయ జూదంబున నలుని పుష్కరునిచే నోడించి రాజ్యమునుండి నలదమయంతులను వెడలగొట్టించెను. ఆహా! కలిమాయ యెంత ఘోరమైనది నిరంతర ధర్మాచార పరాయణులైన యా నలదమయంతులకు సంభవిల్లిన కష్టములను చదువరులు పరిశీలింపుడు. ధర్మమును నాలుగు పాదములను నడపి ప్రజలను తమ బిడ్డలవలె గాపాడిన యానలదమయంతులు నిరాధారులై బిడ్డలతో మిక్కిలి దుఃఖసముద్రమున మునిగియున్న తరుణమున నొక్కడైనను వారిచెంతకు బోవుట గాని వారిక్షేమము నరయుట గాని జరుగదయ్యె. ఇది యంతయు కలి యొక్క మాయయే యని గ్రహింపుడు.

నలుడు, దమయంతియొక్క దుస్థితిని జూడలేక విదర్భాపట్టణమునకు జేరుమని యామెకు ధైర్యమును జెప్పెను. అంతట దమ

యంతి నాథా! పతికంటె గతులుసతులకు వేరెండైన గలవా? రామునితో సీతామహాదేవియు హరిశ్చంద్రునితో చంద్రమతియు మున్నగు మహాపతివ్రతాతిలకంబులు ఘోరారణ్యంబులకు బోయి వెతలను బొందలేదా? కావున నెల్లవిధముల మీ సమక్షమే నాకు దివ్యసౌధము. మీపరిచర్యలే నామహాభాగ్యములు నాయందు కరుణ జూపి మీ వెంట దోడ్కొని పొమ్మని భర్తను పరిపరి విధముల ప్రార్థించెను. ఒకదినమున మిక్కిలి యాకటిబాధచే పరితపించుచుండెగా కలిపురుషునిచే పంపబడిన కొన్ని బంగారు పక్షులు నలునిదగ్గఱ విహరింపగా నవి నిజమైన పక్షులని భ్రాంతిగొని నలుడు తన యుత్తరీయముచే వానిని పట్టబోగా నవి యావస్త్రమును హరించి గగనంబున కెగసెను.

ఇట్లు మోసపడి నలుడు వస్త్రహీనతను బొంది అడవిలో నొక చోట దమయంతి తానును కొంతవడి విశ్రమించియున్న సమయంబున దమయంతినిద్రపోవుటగాంచి ఆమెవస్త్రమును సగముచించి నలుడు వెడలిపోయెను. దమయంతి నిదుర మేల్కాంచి నంత నలుని గానరాక బహు పరితపించి దమయంతి యరణ్యంబున యసహాయయై యుండెను. మార్గమధ్యమున నొక్క మహాసర్పము దమయంతిం బట్టగా సమీపమున నున్న కిరాతు డొకడు సర్పమును జంపి దమయంతిం గాపాడెను కాని వాడు దుష్టబుద్ధియగుటచే దమయంతిని మోహించి యామెను దాకబోయెను. మహాపతివ్రతయగుటచే భర్తనుమనంబున స్మరించి తన్మహిమంబున కిరాతుని శపించి దగ్ధంబు గావించెను.

కొంత దూరము సాగగా తన భాగ్యవశంబున ఋష్యాశ్రమ మొకటి చూచుట లభించి ఋషులను గాంచి దమయంతి యిట్ల నెను. మహాత్ములారా! నన్నెన్నడైన నీయిడుమలుబాయునా? నామ

నోనాథుండగు నలునిగాంచ గలుగుదునా? యానతిండని వారిని ప్రార్థించెను. అమ్మా, అనతి కాలంబున నీయభీష్టంబు నెఱవేర గలదు ఎప్పటి యట్ల నిజవైభవంబుల దులదూగెదవని బలికి వార దృశ్యులైరి.

మరికొంత దవ్వుగుగగానొక మడుగును దాని చుట్టును విశ్రమ యోగ్యములైన వృక్షములును గలిగిన శరణ్యము ప్రాప్తించెను. దమ యంతి యాసరోవరతీరంబున వర్తకుల సముదాయము నొకదానిని గాంచి సోదరులారా, మీరెచ్చటనుండి వచ్చుచున్నవారు? ఎచ్చటికి బోయెదరు! అని ప్రశ్నింపగా అమ్మా మాది చేదిపురము. మేము వర్తకులము. వ్యాపారమునకు ఈయా చోటననేల? కాని మేమి ప్పుడు చేదిపురమునకు బోయెదము. ఈరేయి యిచ్చట నిద్రించి తెల్ల వారగనే పయనమై సమీపముననున్న చేదిపురమును జేరగలుగు దుము. అమ్మా నీ వెవ్వరిదానవు నీవృత్తాంతము మాకు దెల్పుడని కోరిరి. అంత దమయంతి తన వృత్తాంతమును దెలిపి నన్నాపురంబునకు గొనిపొండని ప్రార్థించెను.

మరునాడు వారు చేదిపురంబునకు దమయంతిని దోడ్కొని పోయిరి. రాజవీధిని నడచుచున్న దమయంతిని ఆపట్టణపు రాజగు సుబాహుని తల్లి మేడనుండి దమయంతియొక్క రూపమును గాంచి విస్మయంబంది మనస్సున కనికరంబు వొడమి తన గృహంబునకు రావించెను. తరువాత స్నానపానాదుల నామెను సేదదీర్చి వృత్తాంత మడిగెను. దమయంతి తన నిజవృత్తాంతమును మరుగుపరచి సైరంధ్రీ వ్రతముతానవలంభించినట్లును, తదీయనియమంబులకు భిన్నములేకజరి గించినయెడల రాజమాతయొద్ద తానుండునట్లునుబల్కెను. చదువరు లారా! దమయంతి చరితం బిట్లుండ యేకాకియై పలుకష్టంబుల బడు చున్న మన నలునియొక్క స్థితిని విచారింతము. నలు డరణ్యంబున నే

యుండి అక్కడ నొక దావానల మధ్యంబున మరణమునకు సిద్ధమైన కర్కోటకుడను సర్పరాజు తన్ను రక్షింపుమని నలుని ప్రార్థింపగా కరుణారసహృదయుడై నలుడు కార్చిచ్చునుండి కర్కోటకుని వెలికి దీసి రక్షించెను. "రక్షించిన వానిని భక్షించెనను" సామితె యిది యేకాబోలు. ప్రాణసంరక్షణార్థమై నలుడెత్తుబడగా కర్కోటకుడు నలుని గరచెను.

కర్కోటక విషముచే నలుని శరీరమెల్లను నల్లబాఱి గుజ్జు రూపముగ మాఱెను. లోకమునకది హానివలె దోచుగాని భగవంతుడు నలుని క్షేమమునకు దీనిని కల్పించెను.

నలుడు గొప్పరాజు మహావైభవము ననుభవించినవాడు. ఇట్టి ప్రచ్ఛన్నవేషము ధరింపమి ముందెట్లు జీవింపగలడు దీని పరమ రహస్యమును కర్కోటకుడు నలునకు దెలుపుచు తానెప్పుడు నిజరూపము కావలెనన్న అప్పుడు తన్ను దలంపుమని చెప్పి పోయెను.

కడపటి వృత్తాంతమేమనగా అయోధ్యను పరిపాలించుచుండిన ఋతుపర్ణుడను మహారాజు దగ్గరకు నలుడు జేరి తన యశ్వశిక్షానైపుణ్యమును పాకశాస్త్రపరిపూర్ణత్వమును దెలిపి నూరువరహాల జీతమునకు కొలువుండెను. ఋతుపర్ణుడును నలుని యొక్క వంటనైపుణ్యమునకును గుఱ్ఱములను సంరక్షించి వానిని చక్కగా నడపు సామర్థ్యమునకును మిక్కిలి సంతోషించుచుండెను. నలుండిట నివసించి యుండగా విదర్భానగరమున భీమరాజు తన భార్యయును తమ కూతురు నల్లుండును, ఎచ్చటనుండిరో, ఎన్నిబాముల బడుచుండిరో, యని కడువిచారించుచు, వివిధదేశంబులకు పెక్కుమందిని వారిని వెదకి తీసికొని వచ్చుటకు పంపియుండిరి. వారిలో నొక బ్రాహ్మణుడు చేదిపురంబున సుబాహుని మందిరంబున నున్న దమయంతిని యానవాలు పట్టి తల్లిదండ్రులకు యీ మెవృత్తాంతమును దెల్పెను. అంతట

దమయంతి విదర్భకు గొనిపోబడెను. కాని నిరంతర భర్తృవిచార మగ్నయై యున్న నా దమయంతికి నలుసందర్శనము కాకుండుటచే యానందము లేకుండెను. తలిదండ్రు లెంత యోదార్చినను యూర డిల్లదు. అన్నపానీయములను గుడువదు; నేలపై బవ్వళించును; పతి వ్రతలకు భగవంతుడు ప్రసన్నమగుటకు ఇంకను సంశయంబు గలదా! వారేమితలచిన కాకపోవును? ఇంత పతివ్రతాశిఖామణి యయ్యును దమయంతి యిన్ని బాములం గుడువనేల యని సంశ యము మీకు గలుగవచ్చును. ఇదంతయు హృదయ పరిశోధనకే గాని మరియెందులకును గాదు.

ఒకరోజున దమయంతి యొక బ్రాహ్మణోత్తముని తన తండ్రి యానతి బిలిపించి భర్త నన్వేషించుటలో నీ క్రింది విధముగా కొన్ని వాక్యములను బలుకుడని దెలిపెను. ఈ వాక్యములకు సదుత్తరము చెప్పిన యాతడే నలుడని గ్రహించి నా కెఱింగింపుడని యావిప్రో త్తముని బంపెను. ఆతడా యా చోటుల తిరిగి తిరిగి తుదకు అయో ధ్యా పట్టణమందు ఋతుపర్ణుని సభాకూటమును ప్రవేశించి దమ యంతి జెప్పిన నీ క్రింది వాక్యములను బలికెను. " ఎంతైన తన భార్య నడవిలో విడచి వస్త్రమును చించి వెడలిపోవువాడును, నిరంత రము భర్తనే దైవముగా భావించి వాని సందర్శనము లేకుండుటచే నిద్రాహారములను మాని వెత నొందుచుండగా సహించు నాతడును యీ మొదలైన కాఠిన్యమును పత్ని యెడల చూపెడు కఠినాత్ము డుండునా" యని పలుక సభవారలెల్లరునూరకుండ గుజ్జురూపధారి యైన బాహుకుడను నామంబు గల నలుడు ప్రత్యుత్తర మిట్లి చ్చెను. " పతివ్రతయగు నారీమణి పురుషుని యందు దోషములు గలిగినను సహించి యూరకుండ వలెను గాని యిట్లు పలుకుట న్యాయమా? యని వక్కాణించెను. ఈసదుత్తరమును ఆ బ్రాహ్మణుడు

విదర్భకు బోయి వారల కెఱింగించెను. అప్పుడు దమయంతి బుద్ధికుశ లతచే యీతండు నలుండని నిశ్చయించి తండ్రికి తన మనోభీష్టమును దెలిపెను. అంతట భీమరాజు ద్వితీయ స్వయంవరం బని నెపంబు వెట్టి ఋతుపర్ణసమేతముగా నలునిరావించెను. నిశ్చయముగా ప్రశ్న లకు సమాధాన మొసంగిన వాడు నలుడు గాని మఱియొకడు కాడు అని మనంబున దిటవుగాంచి వానిని రప్పించుటకును వానినే తిరిగి వరించుటకును నిశ్చయింపబడిన స్వయంవరముగాన దీనియందు దుర్దోషముండునని మనము భావింపరాదు. అనగత్యముగా ఋతుపర్ణ నకు భ్రాంతియును శ్రమను కలిగించినందులకు అనుగ్రహారాజును, భీమరాజాదులు మన్నింప వేడి యేవిధమైన కళంకము లేకుండ స్వయం వరమును జరిగించిరి. ఆసమయంబున నలుండు కర్కోటకుని స్మరించి తత్ప్రసాదంబున వికృతరూపమును విడచి తొల్లిటి సౌందర్యవైభవం బున స్వయంవర మందిరంబును నలుండలంకరించుటయు, దమయంతి మహావైభవంబున వాని జెట్టబట్టి కలిపురుష దోషంబు లెల్లయు వాసి పునర్ద్యూతంబున పుష్కరుని నోడించి ఎప్పటియట్ల నిషధ రాజ్య లక్ష్మిని బడసి సుఖంబుండిరి. ఇట్టి పావనచరిత్రమును చదివిన వారెల్లరు కలిదోషవిముక్తులై నారీరత్నములు దమయంతి నలె సుగు ణసౌభాగ్యంబుల తేజరిల్లుచు పతిపూజాధురంధరులై యిహపరసౌఖ్య సంప్రాప్తులైయును పురుషపుంగవు లెల్లరు దివ్యచారిత్రుడైన నల మహారాజువలె భువనసన్నుతులై సత్యసంధులై పరమేశ్వర ప్రసాద సిద్ధులై వర్ధిల్లుదురు గాత!

దమయంతీ దేవి చరిత్రము సంపూర్ణము.



# 2 చంద్రమతీదేవి చరిత్రము.

ప్రసిద్ధిజెందిన కోసలరాజ్యమునకు రాజధానియైన అయోధ్యానగరంబున పూర్వము త్రిశంకమహారాజు కొమారుడైన హరిశ్చంద్రుడను చక్రవర్తి పరిపాలించుచుండెను. ఆతడు సూర్యవంశోద్భవుండును మహాగుణ సంపన్నుడునునై తన తేజోమహిమంబున విరాజిల్లుచుండెను. ఎన్నడును సత్యము దప్పనివాడు. ఈతనికి సాటియొరులురాజులలో లేరని చెప్పవచ్చును. ఈసందర్భమున నుండగా స్వర్గలోకమున దేవేంద్రు డొకడు సభాస్థలిని నిండియున్న నారదాది మహామునీంద్రులఁ నవలోకించి యిట్లనియె. మునిపుంగవులారా! భూమండలము నేలు నరపాలురందు సత్యసంధుడెవరు? పేర్కొనుడని యానతిచ్చెను. అంతట వారిలో వసిష్ఠుడు లేచి త్రిశంకుకుమారుడైన హరిశ్చంద్రుడు దక్క నిక్కమంబగు సత్యశీలుండు మరియొకండు లేడని విశదముగా బల్కెను.

అందుపై విశ్వామిత్రమహాముని మిగుల కోపించి అది కేవలమసత్యము; వానిని క్షణమాత్రమున నసత్యము బల్కించి నాశపథంబు నెఱవేర్చెదను. అనిపల్కెను. ఈప్రకారము వశిష్ఠుడును విశ్వామిత్రుడును తగవులాడి పందెమొడ్డినవారు గాడిదపై నూరేగింపబడు నటులను తనతపస్సును, గెలిచినవారికి ధారవోయునటులను నిర్ణయింపబడెను. అంతట సభాస్థలమునువీడి సభ్యులెల్లరు తమ నిజస్థలంబుల కరిగిరి.

తరువాత విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని వ్రతభంగమును గావించుటకును, తన యుద్యమంబు నెరవేర్చుటకును బూని భూలోకంబునకు వచ్చి, హరిశ్చంద్రుని పురంబుజొచ్చి తనవచ్చినపని హరిశ్చంద్రునకు

దెలిపి కొలదిదినములలో తానుతలపెట్టి యాగము నెఱవేరవలయునని యు దానికి ఏనుగుమీద నెక్కి యొకమనుష్యుడు గవ్వమీటిన నెంత దూరమరుగునో యంతద్రవ్యముకావలెననియు, సత్కారమొనరింపవల యుననియు కోరెను. కపటోపాయుడైన విశ్వామిత్రుని మాయను దెలియక వలసినంత ద్రవ్యమిచ్చెదననియు దానినిప్పుడ గొంపోవుడని యు వినయాదిసద్గుణసంపన్నుడైన హరిశ్చంద్రుడుబలికెను. కానివిశ్వా మిత్రుడు వెనువెంటనే దానిని గైకొనక నాకగత్యము వచ్చినపు డిమ్మని చెప్పి వెడలిపోయె తరువాత ఇరువురు మాతంగకన్యకలను రూపవిలాసవతులను నృత్యగానవినోదనై పుణ్యములనుపురిగొల్పి హరి శ్చంద్రుని సమక్షంబునకుబంపెను. వారిరువురును తమకు విశ్వామిత్రు డుచేసిన దుర్బోధలను మనంబున బెట్టుకొని తమ విద్యానైపుణ్యము లను జూపి హరిశ్చంద్రుని మెప్పించి యమ్మహారాజు తమకు దయ చేయు సత్కార్యములను గైకొనక తమ్మును బెండ్లియాడుమని నీచముగా బలికిరి. ఎన్నివిధముల బోధించినను, వినక తమపంతము చెల్లింపవేసిరి. అందుపై హరిశ్చంద్రుని భటులు వారిని దూరముగా తొలగించిరి.

మాతంగకన్యకలు తాము అవమానమును మిక్కిలి పొంది తిమనిన్ని యీదుఃఖమును మేము భరింపలేమనియు విశ్వామిత్రునితో మరికొన్ని విషయములను గల్పించిజెప్పి, యాతని కోపోద్దీపితుని జేసిరి. అందుపై విశ్వామిత్రుడు తోకత్రొక్కినపాముచందంబున హరిశ్చంద్రు నిమందిరంబున కరిగి యిట్లనియె. ఛీ! దురాత్ముడా నాబిడ్డలగు మతంగకన్యకలను సన్మానింపక వారిని భటులచే నవమానించుటనీకు దగునా? నీయంతద్రోహియెందైన గలడా? యని పలుకుటయే గాక రాజును తీవ్రముగా తనపాదంబుల దన్నెను. అందుపై నారాజ చంద్రము డాతాపసుని పాదంబుల బడి మునిపుంగవా, నేనిచ్చు

సత్కార్యములను దీసికొనక వారు పెండ్లియాడుమనికోరిరి. నారాజ్యమంతయు ధారపోసెదనుగాని యట్టి నీచకృత్యంబున కొడంబడనని పలికెను.

అందుపై విశ్వామిత్రుడు తన యాశ్రమంబునకుబోయి వేరొక మాయోపాయంబున హరిశ్చంద్రుని మోసపుచ్చదలంచి హరిశ్చంద్రుని వేటసమయమెప్పుడు వచ్చునాయని నిదానించి యొకనాడు హరిశ్చంద్రుడును నాతని భార్యయగు చంద్రమతీదేవితోడను, కుమారుడగు లోహితాసునితోడను మరియుంగల పరివారముతోడను విహారార్థమై విశ్వామిత్రుని యాశ్రమసమీపమునకు వచ్చి యచ్చట నొకచోట వినోదంబుల నరయుచుండగా విశ్వామిత్రునిచే మాయాకల్పితమైన నొక పసిడిలేడిని యందందుగ విహరించుచుండె. దానిని లోహితాస్యుడు జూచి ప్రేమించి గొనితెమ్మని తండ్రినికోరెను. దానిని రాజు పట్టుకొనబోగా బెదరి విశ్వామిత్రుని యొద్దకు పారిపోయెను. ఆసంగతి విశ్వామిత్రుడు గ్రహించి యినుమడించుకోపంబుతో యెవ్వడురా దురాత్ముడు? నాప్రియమైన లేడిని బాధించి నామనంబునకు అలసటను గలిగించుచున్నాడు అని బిగ్గరగా బలుకుచు వెలికివచ్చినంత హరిశ్చంద్రుడు గానంబడెను. విశ్వామిత్రుని కోపాగ్నిని జూచి హరిశ్చంద్రుడు మిగుల భీతిల్లి మునీంద్రా! యాగ్రహింపకుడు నేనే యాదుర్మార్గుడను, క్షమింపుడు నాకుమారుడు దానిని బట్టితెమ్మన మరియొక లేడియని భావించి ప్రయత్నించితినేకాని నీయాశ్రమము నందలి లేడియని యెఱుంగను. ఈ యపరాధమును మన్నింపుడని వేడెను. విశ్వామిత్రుడు మాతంగకన్యకలను రాజు వివాహమాడిన యెడల తప్పుక్షమించునటుల బలికెను. రాజ్యమంతయు ధారవోసెదను గాని అట్లుచేయనని రాజుబల్కెను. ముని రాజ్యమును సంపూర్ణముగ ధారవోయించుకొని తప్పును మన్నించి రాజును విడచి రాజ్య

మును తనకు ఒప్పగించవలసినదనియు తక్షణమే తనయాగద్రవ్య మొసంగుమనియు నిష్ఠురోక్తులతో బలికెను. ధర్మమునకును సత్యమునకును కట్టుబడిన యారాజోత్తముడు రాజ్యమెల్లయు విశ్వామిత్రుని యధీనముచేసి ద్రవ్యహీనుడగుటచే యాగద్రవ్యమును మాత్రము తరువాత తీర్చుకొనెదనని బలికి పురంబువీడి విశ్వామిత్రుని శిష్యుడగు నక్షత్రకుడు వెంబడింప ఋణతీర్పుమార్గమై కుటుంబసహితముగా వెడలిపోయెను.

ఇట్లు హరిశ్చంద్రమహారాజును మహాపతివ్రతాతిలకంబగు చంద్రమతీదేవియు లోహితాస్యుడును కపటవేషధారియైన విశ్వామిత్రశిష్యుండగు నక్షత్రకుండును వారణాసికి ప్రయాణమై మహారణ్యమార్గంబున బట్టిరి. ఆహా! వ్యాఘ్రభల్లూకశరభమృగాదిమహాజంతుసంకులమైయాయరణ్యంబున క్షుత్పిపాసలకు రాజకుటుంబముపడిన బాధలకును వానికి రెండు రెట్లు నక్షత్రకుడు నోరిని పెట్టిన బాములకును మేరలేదుగదా! ఒకనాడు వారెల్లరు పయనమైపోవుచుండ దావానలము చుట్టుముట్టెను, దానినుండి ప్రాణములను రక్షించుకొనుట మానవమాత్రులకు సాధ్యమగునే? అట్టితఱి తన యసమానమహిమంబుచే చంద్రమతీదేవి, యాకార్చిచ్చులోబడి తన మేనుపైనుండి వారినిదాటించి గండము గడపెను. ఆమె తన సువ్రతంబులచేతను, తన పాతివ్రత్యమహిమంబుచేతను గదా! యగ్నిహోత్రుండు తన వేడిమి నంటనీయక యామెకు తోడ్పడెను,

ఈవిధముగా పలుతావుల నిట్టి యిక్కట్టులు వేనవేలు సంభవించినను లెక్కసేయక యమ్మహాదేవియొక్క సౌశీల్యంబుచేతను ఆరాజపుంగవుని సత్యసంధతచేతను వారరణ్యంబును గడచి కాశీపురంబుజేరిరి. నక్షత్రకుండు క్షణక్షణంబును మునిపుంగవుని ద్రవ్యము నిమ్మని రాజునుపీడించుటచే తుదకు ద్రవ్యమెందునను జిక్కకుండుటచేతను; హరిశ్చంద్రుడు తన పత్నిని కాశీవీధిలో బహిరంగముగా

నమ్మి వేసెదనని ప్రచురము చేయించెను. అప్పుడు కాలకౌశికుడను బ్రాహ్మణుడు చంద్రమతిని, ఆమెకుతోడు లోహితాస్యుని క్రయమునకు గొని విశ్వామిత్రునికి జెల్లించవలసిన మూలద్రవ్యము పూర్తిగా నిచ్చివేసెను. నక్షత్రకుడు ద్రవ్యనును మూటగట్టి వడ్డిసొమ్మును తన దారిభత్యమును నిమ్మనికోరెను. అందుపై హరిశ్చంద్రుడు వీరబాహుడను చండాలుని యొద్ద కాటికాపరిగనుండి యూడిగము సేయనిశ్చయించి వీరబాహునిచే శేషించిన ఋణద్రవ్యమును నక్షత్రకుని కిప్పించెను. నక్షత్రకుడంతట పురము విడచిపోయి విశ్వామిత్రునకీ ద్రవ్యమును సమర్పించెను.

ఆహా! ఇంత కాలమునకు విశ్వామిత్రఋణవిముక్తిచే హరిశ్చంద్రుడు కృతార్థుడయ్యెను. ఎన్నిప్రయత్నములు జేసినను హరిశ్చంద్రుడు అసత్యమునుబలుకడయ్యె. తన పట్టిన శపథమును తీర్చుకొనవలెనని విశ్వామిత్రుడు మిక్కిలి పూనికతో మరికొన్ని ప్రయత్నములకు సమకట్టుచుండెను. చదువరులారా! సాధ్వీమణియగు చంద్రమతి కాలకౌశికుని సతియగు కలహాకంఠిచే పడెడు కష్టములకు మితియును గలదే? శత్రువులకైన యింతటి కష్టములు తగవని కాశీనగరవాసులెల్లరు కలహాకంఠిని నిరంతరము నిందించుచుండిరి. అయినను అమ్మహోముసి మాయాకల్పితముగుటచే నెవ్వరేమిచేయుటకును వీలులేదు కదా! కలహాకంఠి యొకనాడు బాలుడైన లోహితాస్యుని వటపత్రముల తెమ్మని యడవికి బంపించెను. పాపమా బాలకుండు సర్పదష్టుడై మూర్ఛిల్లియుండెను. వాని తోడిబాలురు చంద్రమతికి సమాచారమును దెలుప దుఃఖసముద్రములో మునిగి నడిరేయి యయ్యడవికి జని చనిపోయినబాలుని భుజంబులపై నిడికొని స్మశాన వాటికకు దహనార్థమై కొనిపోయెను.

అచ్చట వీరబాహుడను నామంబుతో తన భర్తయే దహనసంస్కారములుగావింపుచుండెను. ముందుగా ప్రతిశవమువకును కాటిపన్ను వానికి జెల్లించుటంపౌరులకు వాడుక గావున ఈమెను వీరబాహుడు కాటి రుసుము నొసంగుమని కోరెను అందుపై నామె తాను ద్రవ్యహీనమై యుండినట్లును యొకరి యింట యూడిగము సేయుచుండినట్లును బలికెను. వీరబాహుడు మంగళసూత్రమును విక్రయించి యైన నిమ్మనెను. ఏమీ ! నామెడనున్న మాంగళ్యమొరులకు గానరాదే యిమ్మహాత్ముడు కేవలము నాభర్త కావలెను. అనినిశ్చయించి తన నిజవృత్తాంతమును దెలిపి విధికృతమగుటచే యేమి చేయునదియిలేక కాటిపన్ను చెల్లింపకతీరదని వీరబాహుడుపలుకగా నిజస్థలంబోన కరుగుచుండెను. ఈ సమయంబున కాశీరాజమందిరమున కొందరు దొంగలుపడి, రాజకుమారునిజంపి యాశవము నందె విడచి కొంతద్రవ్యమును, ఆభరణములను ఎత్తుకొని పోవుచుండగా దారిలో పరుగిడుచున్న నిర్దోషియైన యీ చంద్రమతి యొడిలో యీ నగలను బారవైచి పరువెత్తిరి. దొంగలను బట్టుకొనుటకు వెంబడించిన రాజభటులు కొందరు నగలతోనున్న చంద్రమతిని గాంచి యీమేయే యీతస్కరియనియు బాలకుని వధించినదనియు నేరములను మోపి రాజసన్నిధిని నిలబెట్టిరి. ప్రత్యక్షముగా నగలు చేత నుండుటయే ప్రధాన నిదర్శన మని, రాజు న్యాయాన్యాయములను వేరుగ విచారింపక తలవరిని పిలపించి నరకింపుమని యాజ్ఞాపించెను.

.. రాజసేవకులు స్మశాన వాటికయందున్న వీరబాహునితో నీవృత్తాంతమును జెప్పి వాని నాయత్తపఱచిరి. ఈ నిర్దోషియైన చంద్రమతి దేవిని అక్రమముగా దహన భూమికి పరిసరంబున నున్న యొక ప్రదేశంబున యీ సుదతీమణిని నిలపి తల నఱుకు మని వీరబాహునితో బలికిరి. ఆహా ! ఎంతఘోర మెంత ఘోరము ! రాజ్యపదభ్రష్

ష్టులై యరణ్యవాసులై బహుకష్టములనుభవించి కంటకుఁడైన నక్షత్రకునిచే పీడింపబడి తుదకు బానిసలై యూడిగంబులబడి యేపాపమెఱుఁగకున్నను, యిట్టి మహానేరముల మోపబడి యీదంపతులు యింతింతనరాని వంతలను బొందుటకు నింతయు కనికరంబు లేని విశ్వామిత్రముని యొక్క మహామాయకల్పనలుగాక వేరొండు కారణంబులు గలవా ? ఇట్టి పరమసాధులను దుఃఖపెట్టిన వారి కిహపరంబుల నెందైన గతులు గలవా ? ఇట్టి యగ్నిపరీక్షలు వచ్చినను తను నిజశీలంబుల విడువక ఐహిక సుఖంబులే శాశ్వతమని యెంచక కేవల పరమార్థచింతయే జన్మసార్థకమని భావించిన యిమ్మహానుభావులకు మోక్షంబు కరతలామలకంబని జెప్పుటకు యింకను సంశయంబు గలదా ? వీరబాహుఁడు తన సహధర్మచారిణి యైన చంద్రమతి యెడగల ప్రేమ యనులతను తొలుత దెగగొట్టి పిదప రాజాజ్ఞను శిరస్సున ధరియింప వలసిన విధిగాన తన ఖడ్గంబుచే నామెను నఱకబోయెను కేవల వైరాగ్యగుణ సంపన్నయగు నాచంద్రమతియు శరీరమ్ముపై దనకుగల యాసను ద్రెంచి తన తల ద్రుంచబోయెడు హరిశ్చంద్రుని ఖడ్గమునకు మేనొగ్గెను. ఇట్లు మొదటి నఱుకునకు కంఠముదెగకుండెను. కారణమేమని తీవ్ర దృష్టితో రెండవపర్యాయము తన ఖడ్గముప్రయోగింపుతఱిని వ్యర్థమనోరథుండగునట్టియు ఆందోళితమానసుండగునట్టియు విశ్వామిత్రుఁడు తత్తరపాటుచెంది రాజా ! వలదు, వలదు. ఇదియంతయు నాచే కల్పింపబడిన మాయగాని వేరొకటి గాదు. నాతప్పు క్షమింపుమని ఖడ్గమును నిలిపి చక్రవర్తియొక్క సత్యసంధతకును చంద్రమతియొక్క పాతివ్రత్యమహిమంబునకు గరంబు మెచ్చి తనదోషంబుల వెలిబుచ్చి మనంబులు నొచ్చకుండునటుల కొన్నిముచ్చటలు బలికెను. ఆతరుణమున బ్రహ్మాదిదేవతలు విచ్చేసి మహావరంబుల నాచక్రవర్తికొసగి మృతినొందిన కాశీరాజకుమారుని

లోహితాస్యుని పునర్జీవితులను జేసి ఎప్పటియెట్లు హరిశ్చంద్రునకు రాజ్యవైభవంబు ప్రసాదించిరి. మరియు వసిష్ఠమహాముని లచ్చోటి కరుగుదెంచి విశ్వామిత్రా! నీవాడిన వాక్యంబు వ్యర్థమయ్యె నాడు దేవేంద్రుని సమక్షంబున నీవాడిన విధంబున జరిగింపుమని వక్కాణించెను. అంతపై విశ్వామిత్రుడు తనతపోధనమందర్ధభాగము వశిష్ఠునకు ధారవోసి తన్ను క్షమింపవేడి వెడలిపోయెను. సుదతీమణులెల్లరు నీదివ్యచారిత్రమందలి చంద్రమతియొక్క పతిభక్తిప్రభావంబునకు మిగుల విస్మయంబందవలసియున్న ఎన్నికష్టములు సంభవించినను దుష్టులెన్నిభంగుల మోసగింపదలచినను పతివ్రతలైయుండిన నారీమణులయెడల తృణయంబులు గావె!

చంద్రమతీదేవిచరిత్ర సంపూర్ణము.



# సీతాదేవిచరిత్రము.

—— :x: ——

మిథిలానగరంబను పురవరంబొకటి గలదు. పూర్వము దానిని జనకమహారాజేలుచుండెను ఆజనకమహారాజొక పెద్దయజ్ఞము చేయం బూని పూర్వపుటాచారముల ప్రకారము, తానే వసుంధరను దున్నుచుండెను. అట్లు దున్నుచుండగా నాగటిచాలునందొక పెద్ద పెట్టెగన్పట్టెను. దానిని దెఱచిచూడ నందొక దేదీప్యమానమగు యాడుబిడ్డ గనబడెను. జనకునికి సంతానములేమింజేసి యాపసిబిడ్డను మిగుల గారాబముతో తనగృహంబునకు దీసికొనిపోయి పెంచుచుండెను. నాగేటి చాలులో దొరికినదిగాన నామెకు సీతయను నామకరణంబిడి యామెను శుక్లపక్షచంద్రునివలె దినదిన ప్రవర్ధమాన నన్నివిద్యలయందును గావించుచుండెను.

అంత నామె నానాటికి పెరిగి పెద్దదై వయోరూపాభిజాత్యములచే నొప్పారుచుండ జనకరాజుతనయొక్క వివాహము చేయదలచి తన గృహంబునందు మిగుల పురాతనమును సంబంధించియున్న పెద్దయినువిల్లును నెక్కుపెట్టినవారికే తనకూతురిచ్చెదనని స్వయంవరము చాటింప జేసెను. ఆస్వయంవరమున కెందఱో రాజులు వచ్చి వింటిని కదల్పనైన లేక సిగ్గుపడి వెడలిపోయిరి.

ఇట్లుండ అయోధ్యాపట్టణము నేలుచుండిన దశరథమహారాజునకు కౌసల్యయను మొదటి భార్యవలన బుట్టిన శ్రీరాముడను కుమారుడు విశ్వామిత్రసహాయుడై మిథిలకుబోయి యావిల్లునెక్కుపెట్టగా నది పెళపెళవిరిగి రెండుఖండములయ్యెను అంత జనకుడు తనకుమార్తెయగు సీతను రామునకిచ్చి దేవబ్రాహ్మణయోగంబుల వివాహంబొనరించి మహావైభవముతో నత్తవారింటికి బంపివేసెను. సీతామహాదేవియు

స త్తమాఘ్నులమాట జవదాటక పెద్దలయందు భక్తిగలిగి జాగ్రత్తగా కాపురము జేయుచుండెను. అంత కొన్నాళ్ళకు దశరథమహారాజునకు రెండవభార్యయైన కైకేయి తన దాసియగు మంధరచే ప్రేరేపింపబడి నదై తనకు వెనుక దశరథుడిచ్చెదనన్నవరంబుల నాసమయమందిమ్మని తనభర్తను ప్రార్థించెను. అవి యెవ్వియని దశరథుడడుగ తనకుమారు డైన భరతునికి పట్టముగట్టవలసినదనియు రాముని పదునాల్గువత్సర ములరణ్యవాసమునకు బంపవలసినదనియు కైకేయినుడివెను.

పిడుగుబోలిన యావాక్కులను విని దశరథుడుమూర్ఛిల్లి కొంత వడికి తెలివిదెచ్చికొని తనసతినెన్నివిధముల బ్రతిమాలినను యామె వినదయ్యె. రామునకానాడే పట్టాభిషేక మొనరించెనని దశరథుడంతకు మున్నే బ్రకటించియుండెను. ఇప్పుడు తన వాగ్దానము చెల్లించుటకై కైకేయికోరిక ప్రకారము భరతునికి పట్టాభిషేకము జేయునా? తాను ప్రచురించిన ప్రకారము రామునికి బట్టముగట్టునా? రామునికి పట్టాభిషేకమునకై పురమంతయునలంకరింపబడెను. అంతయునాయత్తప ఱుపబడెను. అట్టిసమయమున దశరథుడు దుఃఖసాగరమునమునిగియుండ రాముని కీవృత్తాంతము దెలిసి తానేస్వయముగా దశరథుని వద్దకు బోయి పితృవాక్యపరిపాలనార్థమై యడవికి బోయెదననియు సందేహ సేమియు సంశయింపక సెలవిమ్మనియు తండ్రిని వేడి తండ్రివలదన్నను వినక తనతల్లికిగూడ జెప్పి అరణ్యవాసమునకై నారవలువలను ధరించి బయలుదేరెను.

అంతసీతామహాదేవి తానుగూడ భర్తనంటివచ్చుటకు సెల విమ్మని వేడెను. రాముడందుల కంగీకరింపక తరుణీ! నీవు సుకుమారి వైన రాజకుమారివి. కానలకడగండ్లకోపజాలవు; సింహవ్యాఘ్ర భల్లూకాదిఘోరమృగముల ధ్వనులకు మిగుల భయమందెదవు; మరియు ఎండనక, వాననక, గుట్టనక మెట్టనక, ముల్లనక, మ్రుటనక,

కూడుగుడిచియు గుడువకయు, నాతో రాజాలవు అని మరల్పజూచె నుగాని యాసాధ్వీమణి, నాధా! మిమ్మువిడచి నేనొంటరిగా నుండ జాలను. స్త్రీకి యర్ధాంగి యనెడు పేరు మీరెఱుంగనిది యే? గావున మీతోపాటు కష్టసుఖములను చెతిసగము పాల్గొనవలసినదానను నేను. సతికి పతితోడిదె స్వర్గము పతిపక్కనుండని సతి స్వర్గనుం దున్నననది నరకమువలెనుండును. గావున నా వాక్యలను త్రోసి పుచ్చక మీవెంటనంటివచ్చుటకు నాకనుజ్ఞయిండని వేడ తప్పిం చుకొనలేక యాదశరథతనయుడెట్టకేల కొప్పుకొనెను. అంత దశరథ మహారాజునకు తృతీయభార్యయందు లక్ష్మణ శత్రుఘ్నులను నిరువురుబిడ్డలలో లక్ష్మణుడను నాతడు దానుగూడ రామునితో బోవుట కేర్పగునుగాని అన్నగారియనుజ్ఞవడసి తానుకూడ బయన మయ్యెను.

ఇట్లు సీతారామలక్ష్మణులు మువ్వురును గలసి పోవుచుండ చాలదూరమువరకు వారియనుచరులు వెంబడించివచ్చిరి గాని రాము నియాజ్ఞచే వారంతట వెనుకకు మరలిరి. వారుమువ్వురంత యనేక మునిపుంగవులను గాంచుచు వారిచే సత్కార్యములందుచు దుష్టరా క్షసులను శిక్షించుచు నదులను దాటుచు యనేక ప్రదేశములందు దిరుగాడుచు యాదలి సృష్టివైచిత్ర్యముల నానందించుచు కట్టకడపట దండకారణ్యమును జేరుచుండిరి.

సీతారామలక్ష్మణులు బయలుదేరు సమయమున తాతగారి యింటివద్ద నున్న భరతుడు బయలుదేరి యయోధ్యానగరము జేర యీవృత్తాంత మంతయు విని తల్లిని జగడమాడి తాను స్వయముగా బయలు దేరి నిజపరివారముతో వచ్చి చిత్రకూట పర్వతముపై రా ముని గలసి కొని తిరిగి వచ్చి రాజ్యము నేలు కొమ్మనియు రాజ్యము తనకవసరము లేదనియు జెప్ప, రాముడు తన పాదరక్షల నిచ్చి వాని

రు మిక్కిలి విచారగ్రస్తులై దక్షిణదిశంబట్టి పోయి ఋష్యమూకాద్రిపైనున్న సుగ్రీవునితో సఖ్యమొనరించి యాతని సోదరుడగు వాలిని జంపి సుగ్రీవునికి పట్టముగట్టిరి. సుగ్రీవుండును వారియుపకారమును మిగుల గొనియాడి సీతను వెదకికొనిరండని తన వద్దనున్న కోట్లకొలది వానరమూకను వెవ్వేరు దిశలకంపెను.

అందు నాంజనేయుండను వాడు రావణుని లంకకుబోయి యాలంకాపట్టణమంతయు గలయవెదకి సీతామహాదేవిని గాంచక ప్రాణమువిసిగి యెట్టకేల అశోకవనమందామెను గాంచి రాముని క్షేమంబామెకు జెప్పి రాముడిచ్చిన యంగుళీయం బామెకిచ్చి జూపుట కొకముద్రిక గైకొని సీతజెప్పిన మాటలన్నియు కడువినయముతో విని తనరాక రావణున కెరింగించవలెనని దలంచి తనకాకలిగానున్న దనియు నొక్కఫలమును గోసికొనుట కనుజ్ఞయిమ్మనియు జెప్పి యాలంకాపట్టణమంతయు గాల్చివైచి సముద్రమును దాటి రామునికి సీతావృత్తాంతమును నివేదించి ముద్రికనానవాలుగా నిచ్చెను.

రామలక్ష్మణులంత సుగ్రీవాది వానరుల సహాయంబున లంకకు వారధిగట్టి వానరసైన్యమును నడపించుకొని లంకంజొచ్చిరి. రావణుని సోదరుడగు విభీషణుడు మొదలగువారు సీతను రామునికిప్పుడైన సమర్పించుమని యెన్నిజెప్పినను వినక రామునితోయుద్ధము చేసి మరణించెను. అంతరాముడవ్విభీషణునకి పట్టముగట్టి యాచంద్రతారార్కముగ లంకనేలుకొమ్మని జెప్పి సీతను దీసికొనివచ్చి నగ్నిగుండంబున బ్రవేశించినగాని లోకులకు నమ్మికయుండదని తలంచి చితిపేర్పించి యందు బ్రవేశింపజేసెను. అయ్యవనిజ, యామహాపతివ్రతాశిరోమణి, యగ్నిగుండంబున బ్రవేశింపగా నగ్నిహోత్రుడు మంచిగంధమువలె చల్లగానుండెను. ఆకాశవాణిగూడసాక్షిగా యామె నిర్దోషురాలుగా నుండెనని బలికెను.

తరువాత వారందరు గలిసి వానరమూకను రాక్షసులను గూడ దీసికొని యయోధ్యాపురంబున కరిగిరి. అచ్చట పురమలంకరింపబడెను. వానరులకును రాక్షసులకును విందులను బెట్టిరి. రామునికి పట్టాభిషేకము జరుపబడెను. ఎవరిస్థలములకు వారరిగిరి. అందరును సుఖంబుండిరి.

పాపమా సీతామహాదేవి, యాపతివ్రతాశిరోమణి, పలుకష్టములనుబడి పదునాల్గేడు లరణ్యవాసమును 10 మాసముల లంకావాసమును జేసినను భగవంతునికి తనివిదీరలేదు గాబోలు. యామెనింకను యిక్కట్టులు బెట్టదలంచెను. ఎట్లన యొకనాడు యయోధ్యాపురమందలి మడివేలొకడు తన విడిచిపెట్టిన భార్యను తిరిగి యేలుకొమ్మనియు శ్రీరాముడంతటి వారుగూడ తనభార్యను తిరిగి యేలుకొన్నారనియు నాతని తల్లిదండ్రులు జెప్ప యా మడివేలు వెఱ్ఱిరాముడు గనుక మరియొకనివద్దనున్న సీతను దెచ్చికొని తిరిగి నేలుచున్నాడు; నేనట్లేలను అని చెప్పెను. ఈమాటలారాముని చెవినందున యామె దోషిగాబోలని యెంచి లక్ష్మణుని జేరబిలిచి యిట్లు జెప్పెను. "ఓయి లక్ష్మణా! నీవదినగారిని యడివికి గొంపోయి నరకివేసి యామెరక్తమును దెచ్చి నాకానవాలు జూపుము" ఈమాటలను విని లక్ష్మణుడు మిగుల విచారించి యాసీతను రథముపై గొంపోయి నఱకచేతులు రాక నిండు గర్భిణితోనున్న తనవదినె నడవిలో విడిచి యేదోయొక జంతువును జంపి దానిరక్తము నానవాలు జూపెను. అక్కటా! భగవంతుడు కష్టపెట్టవలెనన్న నెన్నియుండలేదు. ఆసీతను తన యౌవనమరణ్యమందును లంకయందును గడపివేసి సుఖమనుభవించుచుండ తిరిగి యరణ్యముల పాలాయెనుగదా. అంత నామె ప్రసవముకాగా యొక మగశిశువు జన్మించె. ఆశిశువును ఆమెను జేరబిలిచి యొక్క ఋషి వారిని బెంచుచుండెను. మరియొకశిశువు నాఋషి సృష్టించి

కుశలవులనిద్దరిని సకలవిద్యలయందున బరిపూర్ణులను జేసెను. అంత అశ్వమేధయాగమునకై రాముడు వదలిన గుఱ్ఱమును యాకుశలవులుగట్టివైచి తమ తండ్రియని యెఱుగియు శ్రీరామునితో మహాఘోర యుద్ధముజేసి మెప్పొందిరి. తరువాత వారు తన కుమారులని దెలిసికొని వారిని సీతను తనపట్టణంబునకు రప్పించి సుఖంబుండిరి. ఆమహాపతివ్రతయగు సీతయొక్క జన్మమంతయు అడవులపాలైనను తనభర్తనే దైవంబుగా నమ్మి నిత్యమును వాని పాదపూజలను గావించుచు స్మరించుచునే యుండెను. గావున స్త్రీలామెను నుదహారణగా గొని తమ భర్తలను దైవంబుగా పూజింతురు గాక!

సీతాదేవిచరిత్రము సంపూర్ణము.



# 4 సావిత్రీదేవిచరిత్రము

చాలకాలముక్రింద మద్రదేశమును సాళ్వపతి యను భూపాలుండేలుచుండెను. వాని కశ్యపతియని నామాంతరముగలదు. అతని భార్యపేరు మాళవి. అశ్వపతికి బిడ్డలులేనందున మిక్కిలి విచారించి భార్యాసమేతుడై కానలకేగి సావిత్రీదేవిని గూర్చి ఘోరతపంబొనరించెను. అంతనాదేవి ప్రత్యక్షమై వారియుద్దేశ్యంబెఱింగి వారు పుత్రునొకని నిప్పించుమని ప్రార్థించగా మహాపతివ్రతాశిరోమణియగు నొక్కపుత్రికారత్నంబు గలుగునటుల వరంబిచ్చి యామె ప్రభావము వలన మరినూర్వురుపుత్రులుగలుగునని నుడివి యాసావిత్రి యంతర్ధానంబయ్యెను. కొన్నిదినముల కారాజుభార్య గర్భంబుదాల్చి యొక చక్కని యాడుబిడ్డను గనెను. సావిత్రీదేవి వరంబున బుట్టినదగుట వలన నామెకు సావిత్రియను నామకరణంబొనర్చి యామెనెల్లవిద్యలందును ప్రవీణురాలినిగా జేయుచుండిరి. అంత కొన్నాళ్లకామెకు యవ్వనము పొడసూపెను.

సాళ్వపతి మిగుల యల్లారుముద్దుగా బెంచిన తనపట్టికెట్టి వరుని దెత్తునాయని విచారించుచుండగా నొకనాడు నారదమహాముని యానృపాలుని వద్దకివచ్చెను. అంత రాజాతనిని యర్ఘ్యపాద్యాదులచే సత్కరించి యుచితాసనముపై గూర్చుండబెట్టగా నారదుండా సావిత్రినివీక్షించి భూపాలా! యుక్తవయస్సున నున్న నీపుత్రికారత్నమున కింకను నేలపరిణయంబొనర్పలేదు? అని ప్రశ్నించగా నాపుడమిఱేడు తనముద్దుల పట్టిని రావించి అమ్మా! నీకు వివాహకాలమాసన్నమయ్యెగావున జగతింగల రాజశ్రేష్ఠులలో నెవ్వరిపరించుటకు నీయభిమతంబో యానతిమ్మనగా ఆమె తండ్రింజూచి జనకా! సాళ్వదేశాధి

పతియగు ద్యుమత్సేనమహారాజు రాజ్యమునంతయు నోడిపోయి యంధుడై భార్యాబిడ్డల సహితముగ కందమూలంబులను భక్షించుచు యరణ్యములో వాసముజేయుచుండెననియు అట్టిరాజోత్తమునకు సత్యసంధుడగు సత్యవంతుడను నొకపుత్రుడుగలడనియు నేను వినియుంటిని. గావున నట్టి యుత్తమవ్రతుండగు సత్యవంతుని గాక యొకులెంతవిభవాతిశయముల నొప్పినను నేబరిణయమాడనొల్లననెను.

అందుపై మద్రపతి నారదుని వైపుదిరిగి, "ఋషిపుంగవా! నియ్యవనిపైనీరు యెఱుంగని స్థలంబులును మనుజులుండరని నాభావము. గావున అట్టి సత్యవంతుడెట్టివాడో యాతని వృత్తాంతంబు విన వేడుకగుచున్నది. సెలవిండు" అనియడుగగా, నమ్మునిశ్రేష్ఠుండు సత్యవంతుడు కళ్యాణమైన యొక్కసంవత్సరములో మృతిజెందునని తేటపరచెను. అంతనారాజు తనకూతుంజూచి, అమ్మా వింటివా! ఆతడల్పాయుష్కుడును దరిద్రుడును గావున నట్టివానిని గోరరాదు. నీయభిమతంబైన మరియొక్కపురుషుని గోరుమనెను. తండ్రీ! మొదటనుండియు నేనాతని వరించి నామనస్సాతని యధీనము గావించియుండి యిప్పుడు వేరొక్కని వివాహముజేసికొనుట పాడియగునా? ఆతడల్పాయుష్కుండైనను సరేగాని నేనతనిని తక్క వేరొక్కని వివాహమాడను, అని సావిత్రి బదులుచెప్పెను. అంత నారాజామె మాటలను త్రోసిపుచ్చలేక తక్షణమే రథగజతురంగపదాదులతోను చతురంగబలములతోను నిజపరివారంబుతోడను తన పుత్రికనుగొనిపోయి అరణ్యముననున్న సాళ్వరాజుంగలసికొని రాజోత్తమా మీకుమారరత్నమగు సత్యవంతుని నాకుమార్తెయగు సావిత్రివలచినది. గావున పరిణయమొనర్చుటకై బయలుదేరి వచ్చియుంటిమని చెప్పగా ద్యుమత్సేను డశ్వపతి కిట్లనియె. రాజశ్రేష్ఠా! మేము రాజ్యమును శత్రులకప్పగించి తినుటకు గూడును, కట్టనుగుడ్డయు, లేక నీఘోరారణ్యము

లో బహుబాములు బడుచుంటిమి. మాయంత దరిద్రులీలోకంబునఁగలరె? పదవిబాసి నీచస్థితినున్న కొమరునికేల సర్వవైభవములతో నున్న మీపుత్రికనిచ్చెదరని జెప్పెనమ్మద్రరాజు. సాళ్వరాజుంగాంచి నృపాలా! కలిమి లేములు కావడికుండలు. ఈరోజులిట్లుండవు. వెన్నెలకొన్నినాళ్లును చీకటి కొన్నినాళ్లును వచ్చునట్లు మానవులకు కష్టసుఖములు వచ్చుచుండును. ఇట్టి శుభకార్యమున కొప్పుకొనుండని యొప్పించి యొకరోజున శుభముహూర్తంబు నిశ్చయించి సత్యవంతునికి సావిత్రికిని పరిణయ మొనర్చిరి. అంత కొన్నాళ్ళకు మద్రాధీసుడు జాయాసమేతుడై తనపురంబున కరిగెను.

అంత నదిమొదలా సావిత్రి ప్రతిదినమును వేకువజామున లేచి, ప్రాతఃకాలాదికక్రియలు నిర్వర్తించుకొని శుభ్రమైన వలువా ధరించి తన గృహంబున గల పనులెల్ల నిర్వర్తించి భర్తపాదారవిందంబులకు మ్రొక్కుచు పతినే దైవంబుగా నెంచి నతనిమనంబున కిష్టమగుపనుల గావించుచు అహర్నిశములతని పదారవిందధ్యానమున నే ప్రొద్దుసల్పుచుండెను. ఇట్లు నారదుడు చెప్పిన వాక్యములను మనమునవిడికొని తన భర్తసంవత్సరమునాటికి మృతిజెందునని దినముల నెన్నికొనుచుండ భర్తమరణదినమిక నాల్గుదివసంబులుండెను. ఆనాడు మొదలు పచ్చి మంచినీళ్లైనను ద్రాగక సావిత్రీదేవి వ్రతంబు సల్పుటెఱింగి యామె అత్తమామలు యట్లేల కృశించుచుంటివని యడుగ నేనొక్కవ్రతంబు బూనియుంటిని. ఆవ్రతంబు మూడుదినముల కంతమగును. మూడవ నాటి రాత్రివర కుపవాసము జేయవలసియున్నదని చెప్ప నత్తమామలువల్లెయనిరి. అంత నాల్గవదినము సమీపించగా సత్యవంతుడు జననీజనకుల వద్దకిబోయి నేనీ దినమున కట్టెలుగొట్టుకొనివచ్చుటకై యడవికి బోవుచున్నానని చెప్పెను. ఈసంగతి విని సావిత్రి తానుగూడ విహారార్థము కానకు భర్తతో వెంబడించి పోయెదనని యత్తమామల

యనుజ్ఞ వడసి భర్తనొప్పించి తానుగూడ సత్యవంతుని వెంటబయన మయ్యెను.

ఇవ్విధముగా వారిరువురడవికి జని యందందు విహారించి శుక పిక మయూరములనునల్లిబిల్లిగ నల్లుకొన్న తీగలను వివిధములాకు పత్రుని వృక్షములనుజూచి సంతసించిరి. గాని కొంతవడికి భార్యనొక్క చోగూర్చుంకబెట్టి భర్తకట్టెలు గొట్టుకొని వచ్చెదనని వెళ్ళి సమితలను నఱుకుసమయంబున నతాత్తుగా త నొప్పి యెత్తుటవలన తిరిగివచ్చి కాంతా! నేడిదేమో యెన్నడెఱుంగని తలనొప్పి యెత్తుచున్నదని జెప్పి సావిత్రి తొడలపై తనశిరంబు నిడి నేలంగూలెను. అప్పుడయ్యం తియు మిగుల చింతిల్లి హా దైవమా, నాకెట్టియిక్కట్టు లీయరణ్య మధ్యంబున గల్పించితి వే? చీకటిపడుచున్నది. ఏమిసేయుదానను యని మిగుల విచారించెను. అంత నించుకతడవులో నొక నల్లనిఛాయగల పురుషుడు పాశమునొకదానిని చేతబట్టుకొనివచ్చి మిగులకోపముతో పాశ మాసత్యవంతునికి దగిలించి లాగుచుండెను. ఈతడెవరో మన చదువరులూహించలేరని నేను దలచుట కవకాశము చిక్కదు. మిగు ల పరమసాధ్వీమణియగుటవలన నాయముడా సావిత్రికి గన్పట్టగా నామె యాతనిగాంచి మిగుల భయమును బుట్టించు నాకారమున నున్న నీ వెవ్వడవు? ఇచ్చటికి రాగతంబేమి? యని యడుగ నాత డమ్మహాపతివ్రతంగని అమ్మా! నేను యమధర్మరాజును. నూ ర్యుని కొమరుండను. నీభర్త కాయుస్సునేటితో పూర్తియైనందున నాపాశంబుంజుట్టి యాతని జీవునిగొనిపోవచ్చినాడనని జెప్పి జీవుని గొంపోయెను.

అట్టి సమయమున సావిత్రి యించుకేనియు భీతినొందక తాను గూడ యముని వెంట నంటిబోవుచుండెను. ఇట్లు కొంత దవ్వరుగుసరికి

యముడు నిలబడి తల్లీ నీవేల నాతో వచ్చెదవు? నేబోవుమార్గమిక నీకు రాదగనిదై యదృశ్యమైయుండునిక వెనుకకు మరలుమన, నామె మిగుల ధైర్యమవలంభించి దేవా? మీవంటి మహాత్ముల ధర్మము నంబుజేసిన స్త్రీల కదృశ్యంబగు మార్గంబుండునే? యని ప్రతివచనం బియ్య యముడామె ధైర్యస్థైర్యములకు మిగులకొనియాడి, తల్లీ! నీభర్తజీవము దప్పనరెద్దియైన నొక్కవరంబు వేడుమని పలికెను. ఆ యమ దేవా! మామయగు సాళ్వప్రభుఁ డంధుడై యున్నడాత నికి కండ్లను దయచేయుమని ప్రార్థింప నాతడట్లే యిచ్చితిక బొమ్మని తనమార్గమునం బోవుచుండెను. అంతటితో సంతృప్తినొందక సావిత్రీ దేవి భర్తయందలి ప్రేమయనెడి లతను ద్రెంచలేక యింకను వెంబ డించిపోవుచుండ యముడు తల్లీ! యేలయింకను వచ్చెదవు అని యడుగ దేవా! తమరు కేవలము ధర్మాచారపరాయణులు; తమ రెటుంగని వ్యవహారములుండునా యని యానతివ్వ యమ్మాటల గరగి నకాల యముడు ఓపతివ్రతాశిరోరత్నమా! సత్యవంతుని జీవంబులు దక్క మరియేదైన నొక్కవరంబు గోరుమిచ్చెదను. అంత నానారీ మణి ధర్మరాజా మామగారగు ద్యుమత్సేనుడు రాజ్యపదవిబాసి యటవులలో నీచస్థితినున్నవాడు. వారిరాజ్యము వారికివచ్చునట్లు వరంబు ప్రసాదింపుమని వేడ నాతడట్లె యిచ్చితిపొమ్మనెను. ఆ రెండు వరంబులను బడసి యింకను వెంబడించిపోవుచుండ యామెపతిభక్తికిని ధైర్యమునకు మెచ్చి యెట్లైన యామెనుండి తప్పించుకొనదలంచి తల్లీ నీపతి జీవనముగాక మరియొక్క వరంబెద్దియైనవేడి వెనుకకు బొమ్మనన నా లలనామణియు దేవా! నాతండ్రియగు మద్రభూపతికి పుత్రసంతానములేక మిగుల చింతాక్రాంతుడై యున్నవాడు. ఆత నికి నూర్వురుపుత్రులు గలుగునటుల వరంబిమ్మనివేడ నట్లేయిచ్చితి పొమ్మని యముడు బలికెను.

ఈరీతి నాసుశీల మూడువరంబులను బడసియు పతిని విడచి పోనేరక తనకుతనపతికినిగల నెయ్యంబను తీగను త్రెంచనేరక యింక ను యమునివెంటనంటి పోవుచుండెను. అంత యముం డామెను గని అమ్మా! మహాపతివ్రతాశిరోమణీ, నాతో గడుదూరము వచ్చితివి; నీవబలవు; ఇక ముందునీవు నాతో రాజాలవు; మార్గమభే ద్యమైయుండును; నీవలెనింతదూరమెవ్వరును రాజాలరు. ఇక వెనుక కరుగుమన, క్షత్రియులు నాలుగువరంబులు వేఁడవచ్చును గదా మిగిలి నవరంబుగూడ నిచ్చినచో తప్పకవెనుకకు మరలెదనని చెప్పగా సరి యేనీపతిజీవములను దక్క మరియొక్కవరము వేఁడు మిచ్చెదనని చెప్ప నేను బ్రతికియున్నంతకాలము నాపసుపుకుంకుమను మాంగల్యంబు నాకుండులాగున వరంబిమ్ము, అని పాదంబులపైబడి పరిపరి విధముల బ్రార్థించ నంత నక్కాంతామణి పలుకులకు మనసుకరగి యముడు, అమ్మాయీ! నీకుమోదంబలర నీమగని బ్రతికించితి నిదేగైకొనుమని యాపాశంబునుండి దప్పించి వారిదంపతుల నాశీర్వదించి యంతర్ధా నంబయ్యె.

అంత నయ్యటవిలో సత్యవంతుడు లేచికూర్చుండి అమ్మయ్యా! యెంత నిద్రపోయిలేచితిని యని తన భార్యను జూచి సఖీ! నీవైన నన్నేల మేలుపరపవైతివి నాతలనొప్పి బాధ బాగుగ దగ్గిపోయె నిక రమ్ముమనగృహమునకు బోదము అని చెప్పగా భార్యయు సరేయనెను. అంతవారిరువురును గలసితమగృహంబుల కరుగుచుండ కన్నులు తిరిగి వచ్చిన యాద్యుమత్సేనుడు బిడ్డలింకను రాలేదేమని యామడవినంత యు సావిత్రీసత్యవంతా యని కేకలువైచుచు గలయదిరిగి వారిని గలసికొని ఎట్టకేల కింటికేగిరి. అంత సావిత్రీదేవి తనయత్తమామల కును భర్తకును జరిగిన వృత్తాంతంబంతయు పూసగుచ్చినచందంబున జెప్పగా వారు కడుసంతసించి యామెయొక్క పాతివ్రతమునకు మెచ్చి కొని వేనోళ్లబొగడిరి. అంత సాళ్వదేశమునుండి మంత్రిసామంతాది

పరిజనంబులువచ్చి ద్యుమత్సేనుని దోడ్కొనిపోయి తిరిగి రాజునుగా జేసిరి. అచ్చట నశ్వపతికిగూడ నూర్వురుపుత్రులు బుట్టిరి. నారీరత్నములారా! చూచితిరా! సావిత్రీదేవి ప్రభావము తనపాతివ్రత్య మహిమచే నెన్నిసుఖముల నొనర్ప గూడెనో? తనభర్తనుగూడ బ్రతికింపగల్గెను.

సావిత్రీదేవి చరిత్రము సమాప్తము.



# 5 అనసూయాదేవిచరిత్రము.

కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వశిష్ఠుడు, వీరికి సప్తమహాఋషులని పేరు. అందు అత్రిమహాముని ఘోరతపస్సు గావించి గృహస్థాశ్రమమే శ్రేష్ఠమని దలంచి సుగుణవతి, రూపవతి, విద్యావతియు నగు అనసూయ యనుకన్యకను బరిణయమాడెను. అంత నాదేవి పతిని దైవముగా భావించి ప్రతిదినమున ప్రాతఃకాలమునలేచి భర్తపాదారవిందములకు మ్రొక్కి ఉదయాహ్నిక క్రియలు నిర్వర్తించుకొని, నూతనవస్త్రములనుదాల్చి ఆభరణాదుల నెప్పుడు గోరక నిత్యమును భర్తనే బూజించుచు యాతని మాట జవదాటక పతికిష్టమగు పదార్థములనే వంట గావించుచు, అతిథుల నాదరించుచు నుపచారం బొనర్చుచుచుండ గాంచి, నయ్యత్రి మిగుల సంతసించి తనసతితో తరుణీ నీకిష్టమైనకోరిక గోరుకొనుమని చెప్పగా నామె మిగుల సంతసించి నాథా! దేనివలన పాతివ్రత్యమహిమయు, యశస్సును మోక్షమును గలుగునో నట్టిదానింత నకు జెప్పుమని పరిపరి విధముల వేడెను. అందున కత్రియపరిమితానందకందళితహృదయారవిందుడై భగవంతునిగూర్చియు పాతివ్రత్యప్రభావములనుగూర్చియు, మోక్షమునుగూర్చియు పూర్తిగా వినిపించెను. అప్పటినుండియు నద్దేవి మరింత వినయము విధేయతభక్తి, గలిగి పతిని దైవంబుగా పూజించుచుండెను.

ఇట్లుండ నొక్కనాడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, సరస్వతీ లక్ష్మిగౌరీసహితులై తమవాహనముల నెక్కి మహామేరు పర్వతమున కాఋషియాశ్రమము మీదుగా బోవుచుండ యాశ్రమము సమీపించగనే వాహనములు నడువలేకుండెను. త్రిమూర్తులచ్చెరు

నొంద గరుత్మంతుడు స్వామీ! యిందెవ్వరో పతివ్రతాశిరోమణి యున్నందున మేము ప్రయాణమును సాగింపలేకున్నారమని చెప్పెను. ఆ దినమున వారు వెనుకకు మరలిపోయి ఆహా పతివ్రతాప్రభావము లింతగొప్పవా ? యనితలంచుచు ముచ్వురేకమై యామెను బరీక్షింప వలెననియు భంగపరచదలచియు మరికొన్నాళ్లకామె వద్దకు బోయిరి. అత్రిమహర్షి త్రిమూర్తులగని మిగులసంతసించి వారికర్ఘ్యపాద్యాదు లనిచ్చి తగిన సత్కార్యములను గావించి నాటికి తనయింట విందు గుడిచి పొమ్మనిచెప్పగా వారందుల కియ్యకొనిరి. అంత నమ్మునిపుంగ వుడు తనభార్యంబిలిచి త్రిమూర్తులతిథులై వచ్చినందున వెంటనేమద్ర సోపేతమగు పదార్థములను పంచభక్ష్యపరమాన్నములను వెంటనే సిద్ధముజేయుమని చెప్ప నామె యట్లనే గావించి పతికెఱింగించెను. అంత నయ్యత్రియు త్రిమూర్తుల ప్రక్కను గూర్చుండి భార్యను వడ్డనసేయుమనెను. గాని యా త్రిమూర్తులామెను భంగపరచదలంచి వస్త్రహీనురాలైవడ్డించినగాని మేముభుజింపనొల్లమనిరి. అట్లే వడ్డించు మని భర్తఅనసూయకాజ్ఞ యిచ్చెను. ఆమె పంచాక్షరీమంత్రమును బఠించి కొంచెము తీర్థమును మంత్రించి తెచ్చి మొదట నాత్రిమూర్తుల మీదఁ జల్లగా వారు పసిబిడ్డలై కావుకావని యేడ్చుచుండిరి. అంతనామె దినమెలతో నాబిడ్డలకు పంచభక్ష్యములతో వడ్డించి భోజనమైనపిదప వారిని శుభ్రపరచి ముచ్వురనుగూడి నొకయుయ్యెల త్తొట్టెలో బండుకొనబెట్టెను. ఇది యంతయు గని భర్తయాశ్చర్య పడుచుండెను. వారు కపటము జేయదలంచివచ్చిన వారుగావున నట్లు జేసితినని యనసూయ తనభర్తతో నుడివెను.

ఇట్లుండగా త్రిమూర్తులభార్యలగు వాణీ, లక్ష్మి, పార్వతులు తమ భర్తలెప్పటికిని రాకుండుట గని అనసూయాదేవి యాశ్రమము నకు బోయి యిప్పుడె వచ్చెదమన్నారు. సూర్యుం డస్త్రాద్రిఁ జేర

న్నాడు వీరలింకను రాలేదు గారణంబేమో దెలిసికొని వత్తము రండని యొకరినొకరు హెచ్చరించుకొని నద్దేవతలు ముమ్మూరా యత్రి మహాముని యాశ్రమమునకుంజనిరి. అనసూయయు వారలగని నమస్కరించి యర్ఘ్యపాద్యాదుల నుపచారమొనర్చి యుచితాసనంబుల గూర్చుండబెట్టి అమ్మలారా! మీరు మాతావునకు వచ్చుటజేసి మేము ధన్యులమైతిమి. నేటిదినమె సుదినముగదా! నానోము ఫలించెను. యని వేనోళ్ల బొగడి మీరిచ్చోటికి వచ్చిన కారణం బెద్దియో వక్కాణింపుడనెను. అంత నాదేవతలు యామె పాతివ్రత్యమును మిగుల కొనియాడి అనసూయతో నిట్లనిరి. అమ్మా నీవంటి మహాపతివ్రతాశిరోమణి నెందును గాంచలేదు. నేడు మాజన్మము పావనమయ్యెను గాని మాభర్తలనుజూపి పుణ్యమును గట్టుకోమని పలుతెఱంగుల బ్రార్థించిరి. అంత అనసూయ యిట్లుచెప్పెను. "తల్లులారా కపటోద్దేశము మనంబున బెట్టికొనివచ్చి నన్ను మానభంగము జేయదలంచినందులకు తమంతట తామె బసిబిడ్డలయిరి.

అప్పుడా పసిబిడ్డలకు బువ్వబెట్టి జోలలుపాడి యుయ్యెలయందునిద్రబుచ్చితినని చెప్పఁ వారాముగ్గురు బిడ్డలంగని యాశ్చర్యమగ్నలై అనసూయాదేవిం గాంచి అమ్మా! నీపతివ్రతామహాత్మ్య మెఱుంగక మాభర్త లిట్లుగావించిరి. అట్టివారి తప్పులను క్షమించి మాపతులను దయసేయుమని వేడికొనిరి.

ఆప్రార్థన వినుసరికి అనసూయ మనస్సు వేడికి గరగిన వెన్నవలె గరగినందున మీరొకులు పట్టుడు మీభర్తల నందువేసెదని ఎవరి భర్తను వారికొసడినందు జాఱవిడిచెను. అంత నద్దేవతలు తల్లీ యీపసికందులను మేమెట్లు గొనిపోగలము. వారి నిజరూపములు వారికిప్పించుమన నప్పరమ పతివ్రతాశిరోమణి తిరిగి పంచాక్షరీ మంత్రమును ధ్యానించి కొంచెము తీర్థమును వారిమీద చిలకరింపగా వా రెప్పటి

యట్లు బ్రహ్మవిష్ణుమహేశ్వరులై యాదేవికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి యిట్లుచెప్పిరి అమ్మా ! నీపతివ్రతామహాత్మ్యము నెఱుగక నిన్ను మానభంగముచేయ దలంచి వచ్చినమాట యదార్థము. నూతప్పులను మన్నించి మమ్ము గాపాడుమని ప్రార్థించి మరియు మేము ముగ్గురము నీకు ముగ్గురు బిడ్డలై పుట్టునట్లువరంబుగూడ నిమ్మనిరి. అంత నద్దేవియు నంతకంటె నాకువేరొండు భాగ్యముగలదే యటులే పుట్టుదురు గాక యని ప్రత్యుత్తరమిచ్చెను. త్రిమూర్తు లనసూయచే సెలవంది తమసతులంగూడ తమతమ నిజస్థలముల కరిగిరి.

కౌం। సూ। ప్ర.

పిదప గొన్నిదినములకు అనసూయగర్భమునందు బ్రహ్మ, చంద్రుడై జన్మించెను ; విష్ణువు దత్తాత్రేయుడై పుట్టెను ; మహేశ్వరుడు దూర్వాసుడుగాజననమందెను. చదువరులారా గ్రహించితిరా యీవింత ? పతివ్రతయగు స్త్రీలకు భగవంతుడుగూడ జడిసి యుపచారమొనర్పవలిసి యుండును. ఆమహత్వమెందుగలదు ? పాతివ్రత్యమునందే గలదు. కాబట్టి పతినిదైవముగా మదినెంచి మనోవాక్కాయకర్మలచే నతని పూజించుచు, షోడశోపచారములను జేయుచు భర్తృపదారవిందధ్యానము సేయుదురేని యిహాపరలోకమందలి సౌఖ్యముల కేమికొదువ? త్రిమూర్తులును తలంచిన కోరికలను సిద్ధింపజేయుదురు వలసినప్పుడు ప్రత్యక్షమగుదురు. అనగా కామినులు తమ పతులను దైవముకన్న నెక్కువగానెంచి వారికెదురుజెప్పక మాటజవదాటక హితమును జెప్పుచు నుండవలెను. ఇదియే మహాపతివ్రతలకు మంచిస్త్రీలకు ధర్మము సుమా !

అనసూయాదేవి చరిత్రము సమాప్తి.



# 6 అరుంధతీదేవిచరిత్రము.

హిందువులలో, ముఖ్యముగా బ్రాహ్మణులలోను వైశ్యులలోను వివాహదినమున పెండ్లికుమార్తెకు ఆకసమున నొకనక్షత్రమును జూపి "యదియేయరుంధతి యను నక్షత్రము. మాదిగకులస్థురాలు. వశిష్ఠునిభార్య తన పాతివ్రత్యమహిమచే నట్లు నక్షత్రముగ మారి ఆ చంద్రతారార్కముగ నక్షత్రమై యొప్పుచున్నది" అని పురోహితులు మొదలగువారు జెప్పుచుండుటవలన మాచదువరులకు గూడ దెలిసియుండుననియే నానమ్మకము. అట్టి మహాపతివ్రతాతిలకమగు అరుంధతి చరిత్ర నిచ్చట వర్ణించెదము.

చాలకాలముక్రిందట సప్తమహాఋషులలో నొక్కండును దేవపురోహితుండును నగు వశిష్ఠునికి వివాహాపేక్షగలిగి తన కెట్టిసుగుణవంతురాలు భార్యయగునో గదా! యని చింతాక్రాంత మనస్కుండై తాపసోత్తముడగు మతంగ మహాముని కొక్కకుమార్తెగలదని విని యచ్చోటికి బోతన యుద్దేశ్యము నాతనికి దెలియపరచెను. ఆ మతంగుడును యవ్వశిష్ఠుని జూచి మిగుల సంతసించి వయోరూపలావణ్యాతిశయములకు తన కుమార్తెయగు నరుంధతికి సరియగునని గ్రహించి తక్షణంబే వివాహంబు గావించి పంపివేసెను.

అత్తవారింటికిజనిన దాదిగ అరుంధతీదేవి తన పతిని కేవలము పరబ్రహ్మస్వరూపునిగా దలంచి షోడశోపచారముల నతనిబూజించుచు భర్తపాదధ్యానము చేతనే కాలముగడుపుచుండెను. అందులకు భర్తఅపరిమితానందకందళితహృదయారవిందుడై యామెంగాంచియొకనాడిట్లనియె. కాంతామణీ! నీవు నాకు మిగుల ప్రియంబు సేయుచు నామనంబు ననుసరించి నడచుచున్నావు. అందులకు నాకెంతయు సం

త్రోవమైనది. నీకేమికావలయునో గోరుము తక్షణము యిచ్చెదనని చెప్పగా నరుంధతి యిట్లనియె. ప్రాణేశ్వరా, యీజీవునకు మోక్షము కలుగు నుపాయంబును, నామానసంబు ధర్మమునందే నిలుచు నుపాయంబును. పాతివ్రత్యప్రభావము వచ్చునుపాయంబును నాకుజెప్పుమని ప్రార్థించగా సమ్మతించి వానిని గూర్చి సవిస్తరముగా వినిపించెను. ఆవేదాంతమార్గమంతయుపూర్తిగావినినఅరుంధతిదేవిమిగులసంతసించి పరబ్రహ్మం బిట్టిదే గదా యని తనలోతానచ్చెరువొంది పరమానందమును బొంది భర్తను పరమాత్మస్వరూపునిగా మదినెంచి యాతని మదికెక్కమెలగ నేర్చుచుండెను.

అంత నొకదినంబున త్రిలోకసంచారియు కలహాభోజనుడునగు నారదమహాముని త్రిలోకంబులలో నున్న పతివ్రతలలో మహాపతివ్రతయెవ్వతెయో తెలిసికొనదలంచి తవ్వెడు బొమ్మరాళ్లను (శెనగలంత పరిమాణముగల వాటిని) మూటగట్టికొని మొదట స్వర్గమునకు బోయి విష్ణుమూర్తిని లక్ష్మీదేవినిగాంచి నమస్కరించి యుచితాసనముపై గూర్చుండగా నద్దంపతులు నారదా నీవుత్రిలోకసంచారివి. నీకు దెలియని విశేషములుండవు విశేషంబులెవ్వియైన జెప్పుమనెను. అంత నారదుడా మూటను విప్పిలక్ష్మికి జూపి, అమ్మా! నేడు నా కేకాదశీవ్రతము. ఈబొమ్మరాళ్ళను శెనగలవలె వేచిపెట్టిన భుజించెదనని చెప్ప లక్ష్మి యందుల కచ్చెరువొంది నారదా యిదేమోయి? యెవ్వరైనను బొమ్మరాళ్ళను శెనగలవలె వేపగలరా? ఇది వింతగానున్నది. ఈపని నావలన గానేరదనిచెప్పి నారదుడంత రాళ్ళను మూటగట్టుకొని నేరుగా కైలాసంబునకు బోయి గౌరీదేవిం గని నమస్కరించి యామెచే సత్కరింపబడి యారాళ్ళమూటను నామెకుజూపి అమ్మా! యీరాళ్ళను శెనగలవలె వేచియిచ్చిన తినవలెనని కోరిక వొడమినది. గావున వేచియివ్వగలవా? యెవ్వరైన బొమ్మరాళ్ళను

# 7 శకుంతలాదేవిచరిత్రము

పూర్వము సప్తమహర్షులలో నొకడగు విశ్వామిత్రుడు వెయ్యేండ్లు సంసారమును విడిచి ఘోరమైన తపస్సు జేసెను. అట్టి తపస్సును భగ్నము చేయదలంచి యింద్రుడు తనవద్దగల వేశ్యకాంతలలో నొక్కతెయగు మేనకను విశ్వామిత్రుని యొద్దకు బంపగా నామె వచ్చి యాతని కెదురుగా నాట్యము చేయజొచ్చెను. అంత నాతడు కండ్లు విచ్చిచూడగా మిగుల సౌందర్యవతియగు మేనక గాన్పించెను. విశ్వామిత్రునిమనస్సు తపస్సునుండి మరలి యామెను వివాహము జేసికొని సంసారసుఖమనుభవింపవలెనని బుద్ధిపుట్టినది. అంత వారిరువురును వివాహము జేసికొని సుఖంబుండిరి. కొన్నాళ్ళగుసరికి మేనక గర్భవతియై యొకచక్కని యాడుశిశువుం గనెను. ఒకరోజున నాశిశువుం గొనిపోయి ముద్దుగా నెత్తుకొనునో లేదో చూతమని మేనక యాబుషికియ్యబోగా తిరిగి సంసారమందు రోతజనించిన యావిశ్వామిత్రుడు పెడమొగము బెట్టుకొని తనకు జూపించవలదని యాశిశువుం గెంటివైచి తిరిగి తపస్సునకు బోయెను. అంత మేనకయు ప్రాణమువిసిగి తనకు మాత్రమెందుకని యాపసిబిడ్డను దీసికొని యొకనదియొడ్డున నొక వృక్షముక్రింద బడవైచి తిన్నగ గగనంబున కెగసి పోయెను.

అంత నావృక్షముమీద గల వేనవేలు శకుంతలములు అను పక్షులామెకు కావలసిన పదార్థముల నిచ్చి యుగ్గుపాలుబోసినట్లు పెంచుచుండునవి. ఇట్లుండ నొకదివసంబున కణ్వమహర్షి యాప్రాంతంబుననున్న తన కుటీరమునుండి యానదికి తపస్సునకువచ్చి పక్షులచే గాపాడబడుచుండిన యాబిడ్డను గాంచి తనకు బిడ్డలులేని కతంబున నామెను మిగుల జాగరూకతతో నింటికి గొంపోయి శకుంతలములను

పక్షులచే గాపాడబడినదిగావున శకుంతలయను నామకరణంబిడి నల్లారుముద్దుగా బెంచుచు నెల్లవిద్యల నామెకు పెద్దదైనకొలదిని జెప్పుచుండెను. అంతనాఋషికన్యకు యౌవనము పొడసూపెను.

ఇట్లుండగా మరికొన్నాళ్ళకు హస్తినాపురము నేలు దుష్యంత మహారాజు వేటకై సామంతాదిమంత్రిపరివారంబుతోను, గజహయరథపదాతులతోడను నొకయటవికి వేటకువచ్చి సింహవ్యాఘ్రభల్లూకాదిఘాతుక మృగములను వేలవేలుజంపి నొక్కమృగముం దఱుముకొని దుష్యంతుడు పోవుచుండగా కొందరు అనుచరులు వెంబడించిరి. ఆమృగము రాజును చాలదూరము దీసికొనిపోయినందున అనుచరులు వెంబడించలేకపోయిరి. అంత దుష్యంతుడే యామృగము నొంటరిగా దఱుముకొనిపోయి యాయడవులలో మార్గము తప్పెను. మిగుల డప్పిగొని పానీయము కొఱకై వెదకులాడుచుండగా సమీపముననే యొకఋషి పల్లెయున్నట్లు గాన్పించెను. ఆతడా ఋషియాశ్రమము ప్రవేశించునప్పటికి నది పత్సని వృక్షంబులతోడను లతలతోడను తీగలతోడను, వన్నెవన్నెలపువ్వులతోడను, హరిణములు మొదలగు సాధుమృగంబులతోడను, కలకలధ్వనులు సలుపుపిట్టలతోడను, కడు రమ్యమై యొప్పుచుండెను. పిదప నారాజు ఋషికుటీరమును జేరి యిం దుండు నదెవ్వరని కేకవేయగా లక్ష్మీదేవిని నిరసించిన సౌందర్యవతియగునొకఋషికన్యక బయటికివచ్చిమిగులవినయముతోనులజ్జతోను స్వామీ తమదేయూరు తమకేమికావలెనని యడుగ నానృపాలుండు నావృత్తాంతము తరువాత జెప్పెదనుగాని మొదట నాకు దాహము కావలెనని కోరెను. అంత శకుంతల దాహముచే నలసియున్న యారాజును దాహమిచ్చి నిర్మల హృదయునిగా గావించెను.

పిదప దుష్యంతుడు ఓకన్యకామణీ! నీవీయరణ్యమున నేల యొంటరిగా నున్నావు? నీతలిదండ్రులెవ్వరు? నాకుం దెలియ జెప్పు

మని శకుంతలనడుగ యామె తలవంచుకొని స్వామీ ! నన్ను ఖణ్వ మహార్షి పెంచుచున్నాడు. ఆతడిప్పుడు నదీతీరమునకు బోయియున్నా డు. ఖణ్వమహార్షి యావృత్తాంతము నొకరితో జెప్పుచుండగా నేను వినిన వృత్తాంతమునే యిప్పుడు మీకు జెప్పెద వినుడని తనపూర్వ వృత్తాంతంబునంతయు జెప్పెను. దానినామూలాగ్రముగ విన్నయాదు ష్యంతు డామెను మోహించి యామె విశ్వామిత్రుని కుమార్తెయగు టవలన యుత్తమక్షత్రియ కులాంగనయే గాని వేరుకాదనియు తానామెను పరిణయ మాడుట కేమియు తప్పుండదనియు నట్టిసమ యమున గాంధర్వవాహము జేసికొనవచ్చుననియు దలంచి యాసంగ తులనామెకు జెప్పెను. అందుమీద శకుంతల లజ్జానీవితముఖయై చాటునకుబోయి, రాజోత్తమా ! నేనుకన్యకను నాకేమియు దెలి యదు. మీరచ్చట విశ్రమించియుండుడు ; మాతండ్రిగారగు ఖణ్వ డిప్పుడే వచ్చుచుండును. అని వాక్రుచ్చెను.

ఈమాటలను విని దుష్యంతుడు కాంతామణీ నేనేమియు తప్పుడుమాటలు నీతో జెప్పియుండలేదు. నేను త్తమక్షత్రియుడనగు దుష్యంతమహారాజను. హస్తినాపురము నేలుచుంటిని. నీవును నుత్త మక్షత్రియ కులాంగనవు. మనము గాంధర్వవాహము జేసికొన్న నీ జనకుడు మిగుల సంతోషించును గాని నిన్ను నిందిపడు ఇదేమియు తప్పులేదు గావున నామాట లాలకించుమనికోరగా శకుంతల రాజా! సరే నేను మిమ్మును వివాహము జేసుకొందును గాని నాదొక్క కోరిక గలదు. అదియెద్దియన మీవలన నాకు బుట్టిన జ్యేష్ఠపుత్రునికి పట్టాభి షేకంబొనర్పవలెను. అని చెప్పెను. దుష్యంతుడును నట్లేచేయుదునని పంచభూతములుసాక్షిగాజెప్పి ప్రమాణికముగూడ జేసెను. అంత వారి రువురు గాంధర్వవివాహము జేసికొనిరి. దుష్యంతుడు కొంతకాల మామెతో సరససల్లాపంబుల గడపి తరువాత మనుజులనంపి యామెను

తన పురంబునకు రప్పించెదననియు తన నౌకరులు వేచియున్నందున తానక్కడికనుండవీలు లేదని శకుంతలతో జెప్పి బయలుదేరి తన యనుచరులను మంత్రసామంతాది వర్గంబును గలిసికొని హస్తినాపురంబున కేగెను.

తరువాత కొంతవడికి కణ్వుడింటికిరాగా దినదిన మెదురేగి ఫలములనందుకొను శకుంతల నేడుకుటీరమున నొకమూలడాగి సిగ్గుచే బయటికిరాదయ్యెను. అంత నామహర్షి అమ్మాయీ! నీవు చేసిన పనియంతయు నాకు దివ్యదృష్టివలన యిదివరకే తెలిసినది. నీవు చేసినపని యందెంత మాత్రమును తప్పులేదు సరేకదా! మిగుల శాస్త్ర సమ్మతమైగూడ నున్నది. మహారాజగు దుష్యంతుడుత్తమకుల క్షత్రియుడు. నీవు గూడ నుత్తమ క్షత్రియకులాంగనవు వయోరూపవిభవాతిశయముల యందు మీకిరువురకును దాంపత్య మనుకూలముగనున్నది. గావున నీవు సిగ్గుపడక వచ్చి ఫలములను గొనిపొమ్ము అని చేతికందిచ్చెను.

పిదప కొన్నిదినముల కొక నవమన్మథుని రూపము గల్గిన బిడ్డకు భరతుడను నామకరణంబు తాతగారగు కణ్వుడే యొనర్చె. అంత నాశిశువు శుక్లపక్షచంద్రుని వలె నానాటికి బెరిగి పెద్దవాడగుచుండెను, ఐదవసంవత్సరము రాగానే తాతగారు అతని కక్షరాభ్యాసము జేయించి తన శిష్యులకప్పగించి భరతు నన్నివిద్యలయందును నుత్తీర్ణుని గావించుచుండెను.

ఎన్నాళ్ళుజూచినను దుష్యంతుడు శకుంతలను తీసుకొని పోవుటకై భృత్యులను పంపకుండుటగని కణ్వుడొకనాడు తన ప్రియపుత్రిం జేరి అమ్మాయీ నీ కుమారుడు పెద్దవాడగుచున్నాడు వివాహమైనకాంతలు పుట్టింట్ల విశేషకాలముండగూడదు. దుష్యంతుడు మనుష్యులను పంపుజాడ గాన్పించదు. గావున నాశిష్యులను జత

యిచ్చి పంపెదను. మీాయ త్తవారింటికి బొమ్మని యొక సుముహూ ర్తంబున బయనము సేయించి హస్తినాపురంబునకు శిష్యులను జత యిచ్చి బంపివేసెను.

అచ్చట హస్తినాపురమున దుష్యంతుడు నిండు కొలువుండు తఱిని వీరు ప్రవేశించిరి. శకుంతలను జూచి దుష్యంతుడెరిగియుండి యు నెఱుగనివానివలె నటించుచు, "నీవెవ్వరవు? ఇచ్చోటి కేలవచ్చి తివని" యడిగెను. శకుంతల మిగుల భయపడి నాసంగతి మరచిరా నాథా? నాడు అడవిలో నన్ను గాంధర్వవివాహము జేసికొని తరు వాత మనుష్యుల నంపి రప్పించెదనన లేదా? నాకు నీవలన బుట్టిన పుత్రుడిడిగో. వీనికి బట్టాభిషేకము జేసెదనని పంచభూతములసాక్షిగా జెప్పలేదా? యని యెన్నియో యానవాళ్ళు జెప్పినను తనసభవారం దఱికెరుంగజేయవలెనని యాదుష్యంతుడు ఓసీ దురాత్మురాలా! నీవెవ్వరవో, మాయస్త్రీనలెగనృట్టుచున్నావు. నీవుజెప్పు మాటలలో నొక్కటియు నిజముగాదు;పొమ్ము. అని కోపపడగానాపతివ్రతశిరోమ ణి నన్ను బొమ్మన్న నేబోయెదనుగాని నీభరతునికి బట్టము గట్టకతప్ప దనెను. దానికాదుష్యంతుడు సమ్మతింపక యామెను, నాబిడ్డను తక్ష ణమావలికి గెంటివేయుడని పారాజవానులకుత్తరు వీయగా వారట్లు జేయుటకు సిద్ధపడుచుండిన సమయంబున అశరీరవాణి యిట్లుబల్కెను "ఓ దుష్యంతమహారాజా! యాశకుంతల జెప్పిన మాటలన్నియు యదార్థములు ఆమె మహాపతివ్రత. నీపట్టపుదేవి. ఆతడు నీకుమారుడు గావున వారిని కఠినోక్తులాడక యేలుకొనుమని పలుక యందరును ఆశ్చర్యపడిరి. దుష్యంతుడును సభవారికి జనులకు దెలియుటకేయిట్లు జేసితినని సభలో జెప్పెను. అంత వారు సుఖంబుండిరి.

శకుంతలాచరిత్రము సంపూర్ణము



# 8 సునీతి దేవిచరిత్రము

త్రేతాయుగమున కమలపురమను పట్టణమునేలుచున్న ఉత్తానపాదుడను మహారాజు సునీతి సురుచియను యిద్దరు భార్యలను వివాహము జేసికొని సుఖముగ రాజ్యమేలుచుండగా పట్టపుదేవియగు సునీతి మిగుల పతివ్రతాశిరోమణియై భర్తపాదములను దైవముగ నమ్మి నిత్యమును భర్తను బూజించుచు భర్తమాటజవదాటక యాతనిమనంబున కెక్కుమెలగ నేర్చుచుండెను. రెండవ భార్యయగు సురుచి యన్న యోదాన ధర్మాదులయందుగాని భయము, లజ్జ, వీటియందుగాని నదురు బెదురు లేక మిగుల కాముకురాలై భర్తను కామోదీపుత్తంగావించి వెలయాండ్రి వలె నాశ జూపించి తన భర్తను వశపరచుకొని సునీతి యగు తన సవతిని జూడ వద్దనియు నిత్యము తన వద్దనే యుండు మనియు తనకు మారు జెప్పవలదనియు బతిని తనకు దాసునిగా జేసికొనెను. ఉత్తానపాదుడును నామె మాట జవదాటక దాసుడై మెలగుచు మొదటి భార్యయగు సునీతిని గన్నెత్తియైన జూడకుండెను. ఇట్లుండ అంతకు ముందె గర్భమును దాల్చిన సునీతి యొకనాడు దివ్య పుత్రిని బడసె.

ఇది విని యోర్వలేక సురిచి తన భర్తతో సునీతిని వెంటనే నగరు వెడల గొట్టక పోయినచో తన వద్దకి రావద్దని బలుక, యామెకా జన్మ దాసుడుగా నుండిన ఉత్తానపాదుడామె మాటను త్రోసి పుచ్చ లేక సునీతి కొక్క యంతఃపురము నగరు వెలుపల నిర్మింప జేసి యామెనందుంచి యోదార్చి వచ్చి సురుచి వద్దనే కాలక్షేపము జేయుచుండెను. అంత మిగుల పతివ్రతయు పరమశాంతు రాలునగు నా సునీతి మిక్కిలి యోపికతో భర్త పదారవిందములనే బూ

జించుచు కుమారుడైన ధ్రువుని నతి గారాబముతో బెంచుకొనుచు ఐదవ యేడు రాగానే అక్షరాభ్యాసము జేయించి బడికంపుచుండెను. ఒకనాటి యుదయమున బడిలోని బాలురు కొందఱితని మాటల సందడిని తండ్రిలేనివాడా! యని నిందించిరి. అంత నాబాలుడా మాటనే తన మనంబున బెట్టుకొని పాఠములను వేగిరముగా నుపాధ్యాయు కొప్పగించి తన తల్లి వద్దకి బడి విడచిన తక్షణమే జని, తన చేతనున్న పుస్తకంబు లొకచోటనిడి తల్లీ! నేనిన్నాళ్లు నుండియు నిన్ను గాంచుచుంటిని గాని నాజనకుని నీక్షింపను. నాతండ్రి యెవరు? యెచ్చోట నున్నవాడు నాకు జనకుని జూడ మిగుల సంతసముగా నున్నది జెప్పుమన నాయనా! నీతండ్రి పేరు ఉత్తానపాదుడు. ఈ పట్టణపు రాజితడే. నగరిలో నున్న యంతఃపురమున తతహంస తూలికా తల్పంబున బవ్వళించియుండును. నేడో రేపో యిచ్చోటకి వచ్చెదరు. అప్పుడు చూడవచ్చును తొందర పడకుమన, అమ్మా అట్లుగాదు. నాతండ్రిని జూడకనే నొక్క నిమషమైనను నిలువనోప. నామనస్సు జనకుని జూడక శాంతి నొందదు. ఆకలిగాదు. సంతోషము లేదు గావున జనకుని జూచివచ్చుటకై, నాకనుజ్ఞ యిచ్చి పంపుమా యని పరి పరి విధముల వేడ పాదములపై బడి నమస్కరింపగా పుత్రుని గాంచి, యట్లేశీఘ్రంబున జూచి రమ్ము ముద్దులపట్టీ, యని ఆశీర్వదించి పంపెను.

అంత ధ్రువుండు నగరంబుజేరి సభాస్థలి ప్రవేశించి, సింహాసనముపై నధిష్టించి యున్న జనకుంజూచి, అపరిమితానందముతో నవరత్న ఖచితమైన సోపానములను దాటి తండ్రియొడిలో గూర్చుండ తలంపున దగ్గరకుబోయి ఉత్తానపాదుని తొడ మీద గూర్చుండగా కొంతవడికి సురుచి తన కొమరుండగు ఉత్తముని, తండ్రి యొద్దకి గొనివచ్చి ధ్రువుని చూచి వానిని రెండు చఱపులు చఱచి క్రింది కీడ్చివైచి యిట్లు చెప్పెను. ఓరీ ధ్రువా! ఈ సింహాసనముపై నెక్కుటకుగాని, తం

ద్రి తొడపై గూర్చుండుటకు గాని, నాకుమారునికి చెల్లును గాని నీకు చెల్లదు. నీతల్లి కడు దుష్టురాలు. నీవును నట్టివాడవే. పో పొమ్ము అని మెడపట్టి గెంటివైచెను. "ఇద్దరిపెండ్లాముల మగడిఱుకున బడినచ్చె" నను సామెతప్రకార ముత్తానపాదుడు చూచుచు నూరకుండెను గాని సురుచి యందు గల రుచిచేత యామెను సుందలించలేకపోయెను.

సభలో నిట్టి యవమానమును బొందిన ధ్రువుడు మిగుల పౌరుషము గలవాడై పిన్న తల్లితన్ను పరచిన అగౌరవమును తనతండ్రి చూచి యూరకుండుటయు పెక్కుమార్లు దలంచుచు, వెలవల యేడ్చుచు తల్లి వద్దకుబోయి జరిగినవృత్తాంతంబంతయు సవిస్తరంబుగా తల్లికి వినిపించి యేడ్చుచునేయుండెను. అంత సునీతి కొమరుని కండ్లనీటిని తనపమిట చెంగుతో దుడిచి వాని నోదార్చి వాని యేడ్పుడిగించి హితవచనంబులు జెప్పి నాయనా నీజనకునికి సురుచి యందుగల ప్రేమ నామీద లేకుండె. ఉత్తముని యందు గల దయ నీయందు లేకుండెను. ఇంతకును మన కర్మమిటులున్నది. మన మేమిచేయగల మని యామె గూడ కండ్లకు నీరు బెట్టుకొనగా, అమ్మా! ఈశరీరములు, ఈసంసారములు, యీమోహముల శాశ్వతములు. మనుజులు ఈసంపదలను నమ్మి మదోన్మత్తులై యుందురు. నాకిట్టి మానవ మాత్రులతో బనిలేదు. నేబోయి శాశ్వతసుఖమును బడసి వచ్చెదను జూడుము. ఇదే తపస్సునకు బోవుచున్నా నాశీర్వదించి పంపు మనెను. అతని తల్లి అందుల కంగీకరింపక పోయినను యెట్టులో యొప్పి జెప్పి సెలవుదేరి తపస్సాచరించుటకై యడవులంబడి పోవుచుండెను.

అట్లు పోవుచుండ మార్గమధ్యంబున నొకఋషి యెదురుపడి సమాచారము ధ్రువుని వలననే విని అబ్బాయి నీవేడ? తపస్సేడ? నీకీ సమయమున యింత పసితనమున తపస్సేమి? వచ్చినదారినే వెనుకకు బొమ్మని చెప్పిరి. గాని ధైర్యశాలి యింకను ముందు నకు బోవుటను

గాంచి యాముని నారాయణుని గూర్చి ఘోరతపంబు సేయుమని చెప్పి పంపి వైచెను. అంత ధ్రువుడు నిద్రాహారములు మాని నారాయణుని గూర్చి ఘోరమైన తపస్సానరింపగా వారు ప్రత్యక్షమై నాబాల కునికి శాశ్వతైశ్వర్యపదవి నిచ్చి పంపివేసిరి. అట్టివరంబు లొంది ధ్రువుడు తిన్నగా నిజగృహంబు నకు విచ్చేసి తల్లికి వందనంబు లొనర్చి జరిగినవృత్తాంతంబంతయు సవిస్తరముగా వినిపించెను. అప్పుడు నారదమహాముని ఉత్తానపాదుని యొద్దకు కని ధ్రువుడిట్టివరంబుల బడసి వచ్చిన సంగతులు జెప్పగా నాతడు మిగుల సంతసించి తన కుమారుని తన భార్యను నూరి వెలుపలనుండి పురంబునకు రప్పించి యెప్పటివలె తనవద్దనుంచుకొని కొన్నాళ్లకు ధ్రువునికి పట్టాభిషేకం బొనరించి రాజ్యలక్ష్మిన ప్పగించి ఉత్తానపాదుడున్ను సునీతియున్ను గూడ నరణ్యంబుల కేగి భగవంతుని గూర్చి తపస్సు గావించి మోక్షంబు లొందిరి. చూచితిరా! చదువరులారా, సునీతికిని సురుచికిని గల వ్యత్యాసము యింతులు, తమపతులు మంచివారు గాక పోయినను సునీతివలె యోగ్య గలిగి మహా ప్రతివ్రతలై యుందురు గాక.

సునీతిదేవిచరిత్ర సమాప్తము.



# 10 ద్రౌపదీదేవిచరిత్రము

మన దేశమున కుత్తరదిశ యందు హస్తినా పురమను రాజ్యమొకటి గలదు. ఆపురవరంబున ధృతరాష్ట్రుడు, పాండురాజు అను నిరువురు సోదరులుండిరి. పెద్దవాడైన ధృతరాష్ట్రుడు పుట్టుకతోనే యంధుడు. అందువలన పాండునృపాలుడే రాజ్యమేలుచుండెను. ధృతరాష్ట్రునకు గల నూర్వురు కొడుకులలో దుర్యోధనుడను వాడు పెద్దవాడు. పాండు భూపతికి కుంతియను భార్యయందు ధర్మరాజు, భీముడు, అర్జునుడు అను ముగ్గురు పుత్రులును మాద్రి యను రెండవ భార్యయందు నకులసహదేవులను నిద్దరు బిడ్డలును బుట్టిరి. వీరి కైదుగురికిన్ని పాండవులని పేరు. కౌరవులను పాండవులను గూడ ద్రోణాచార్యుల వద్దవిలువిద్య నభ్యసించి యావిద్యలో ప్రవీణులైరి కాని అర్జును డందరికంటెను మిగుల నేర్పరి యాయెను పాండవులకు రాజ్యమును బంచి యివ్వవలసి వచ్చునను తలంపు చేతను జనులచే వారు మిక్కిలి గౌని యాదబడు చుండుట చేతను వారియందున సూయగలిగి దుర్యోధనుడు వారల జంప బ్రయత్నించెను. అందులకై నొక లక్క యింటిని కాశీపురమందు పురోచనునిచే నిర్మింప జేసి యెట్లయిన పాండవులు నాయింటయందుంచి తగుల బెట్టుమని వానిని హెచ్చరించెను. దుర్యోధనుని ప్రోత్సాహమువలన ధృతరాష్ట్రుడు పాండవులను కాశీయాత్ర జేసి కొన్నిదినము లచ్చోట నివసించి ప్రజలకు తమ యందుగల వినయవిధేయతలను జూచి రండనియు బంపగా పాండవు లీదురాలోచన గ్రహించిరి. కాని బయలుదేరి పోయిరి. అట్లు బయలు దేరుటకు ముందుగా విదురుడను నాతడు దుర్యోధనుని కుట్రపు టాలోచనను గూర్చియు లక్కయింటిని గూర్చియు బోధించిపంపెను.

పాండవులును కాశీపురము జేరి లక్కయింట గొన్ని దినములు నివసించిరి. కుంతి కూడ వారితోనే యుండెను గావున యొకనాడామె బ్రాహ్మణులకొక గొప్పసంతర్పణగావించెను. ఆసంతర్పణదినమునపురోచనుడు, తప్పత్రాగి పడిపోయి నందున వానికి గాఢముగా నిద్ర పట్టెను. పాండవులంతకు ముందుగానే లక్కయింటి సావడిలో నుండి యూరివెలుపలనున్న యటవిలోని యొక సొరంగమును దవ్వించు కొనియుండిరి గావున నాటిరాత్రి లక్కయింటిని దామే నిప్పంటించి యాసొరంగములో నుండి దప్పించుకొని పారిపోయిరి. "ఎవ్వరు త్రవ్వుకొన్నగోతిలో వారేపడెదరు" అను సామెత ప్రకారము పాపమా పురోచనుడు ఆలక్కయింట బడి ఎలుకవలె మలమల మాడి చచ్చెను.

పాండవులు కుంతిని గొనిసికొని యా యర్ధరాత్రంబున నటవి ప్రవేశించి చీకటిలో జాలదూరము నడచి పోయిరి. అంత కుంతికి దాహమైనందున నీరమ్మునను గొని రమ్మనిచెప్ప అందరి నొక్కచోట గూర్చుండ బెట్టి భీముడొక పాత్రందీసికొని జలము గొనివచ్చుటకైపోయి తిరిగి వచ్చుసరికి వారందరు హస్తములనే తలగడలగా నిడుకొని గాఢనిద్ర జెందుట గాంచి వారికి నిద్రాభంగము కాకుండ నుగాతీర్థ మొకచోట పదిలముగా బెట్టి తాను వారిచుట్టుఘారా గాచుచుండెను. అంతన య్యర్ధరాత్రంబున నరమాంసమును వాసన జూచిన హిడింబాసురుడను రక్కసుడు, తన సోదరిని హిడింబయను దానిని బిలచి వారిని తక్షణమే జంపి తీసుకొని రమ్మని పంపగా యామెవచ్చి భీముని మోహించి తన్ను వివాహము జేసి కొనుమనియు తన సోదరుని వల్లనుండి వారిని దప్పించి వైచెదననియు జెప్పగా భీముడందుల కొప్పుకొనలేదు.

అంత హిడింబాసురుడు తనచెల్లెలిమీద మిగుల బెద్దపెద్ద కేకలు వేసి కొనుచు రాగా, భీముడు తన సోదరులకు నిద్రాభంగముకాకుండ యారక్కసిని దూరముగా గొనిపోయి యచ్చోట సంహరించి, తల్లియు

నుమతిని హిడింబిని వివాహమాడి యామె గొంతకాలమా బున గడపి యొక పుత్రునిబడసెను. తరువాత పాండవులు దీసి కొని యనేక ఋషులను పుణ్యక్షేత్రములను దర్శించు కొనుచు కందమూలంబుల నారగించుచు కట్టకడపట యేక చక్రపురమను నొక పట్టణంబు జేరి యందొక బ్రాహ్మణ గృహమున నివసించి మాధుకర వృత్తిని జీవనము జేయుచుండిరి.

ఇట్లుండ నొకనాడు పాండవులు కాపురమున్న యింటిలో నొక గొప్ప రోదనధ్వని వినబడగా కుంతిపోయి యిది యేమని యడుగ వారిట్లు జెప్పిరి. అమ్మా ! మాయూర నొక బకాసురుడను పెద్ద రాక్షసుడు గలడు. ఆత డూరిమీద బడి మనుష్యులను తన యిష్టము వచ్చినట్లు దినివేయుచుండ నూరి వారందరు అతని సఖ్యపరచి ప్రతి దినము ను రెండు దున్నపోతులను నొక బండెడు అన్నమును నొక మనుష్యుని వంతుల ప్రకారమిచ్చు నట్లొప్పుకొనిరి. నేడు మావంతు వచ్చినది. గున్నలును బండెడు కుంభమును సిద్ధముగా నున్నవి గాని, మాలో ఎవరు వెళ్లుదుమా ! యని యాలోచించు చున్నవారమని నాయింటి యజమానుడు నాక్రుచ్చెను. అందులకు కుంతి వారినంపరి నేనొక సద్దని యోదార్చి తన కొడుకులందరు భీముని నాపని కై బంపెదనని చెప్పి యట్లు బంప భీముడాబండి యన్నమును పూర్తిగా దినుటయు నాక, యారక్కసునితో ఘోరయుద్ధము చేసి యాతని జంపివైచి యాపురము వారికానందమును గల్పించెను. అంత తాము పాండవులని యెవ్వరికేనియు దెలిసి పోవునను భయముచేతను తామాస్థలమును తక్షణము విడిచి పోజూచుచుండిరి.

ఈ సమయమునందే పాంచాల దేశమును ద్రుపదరాజేలు చుండెను. ఆతనికి ద్రౌపదియను చక్కని కుమారీ రత్నముండెను ఆమెకు యుక్త వయస్సు రాగాన పెండ్లిసేయ దలంచి తండ్రి స్వయంవరము

చాటించెను. ఈ స్వయంవరమును వినిన పంచపాండవులు తల్లి యాజ్ఞ ప్రకారము తాముగూడ తమ యదృష్టమును బరీక్షింప గోరి పాంచాలనగరము నకు ద్రౌపతీ స్వయంవరమునకై బోయిరి. ఆ నరేంద్రుని గృహామున నొక మత్స్యయంత్రము గలదు అనగా ఒక మత్స్య మొక చక్రము నందు గిరగిర దిరుగు చుండును అట్టి యంత్రము నెత్తుగా వ్రేలాడ గట్టించి నీటియందు దాని ప్రతిబింబమును చూచి గురి పెట్టికొట్టిన వారికి తన కుమార్తె నిత్తునని చాటించెను. దీనికే ద్రౌపదీస్వయంవరమని పేరు.

ఇట్టిస్వయంవరమునకు దుర్యోధనుడు కర్ణుడు మొదలగు యనేక రాజులు వచ్చిరి కాని యెక్కడును దానిని గొట్ట లేక తలవంచికొని యూరకుండిరి. కర్ణుడు గొట్టబోగా, ద్రౌపతి యాతడు సూతపుత్రుడు గావున నిట్టిపదవి కర్హుడుగాడని చెప్పెను. అంత బ్రాహ్మణవేషధారులై తల్లినొక కుమ్మరివానియింటగూర్చుండబెట్టి వచ్చిన పాండవులలో అర్జునుడు కదలివచ్చి యాబాణము నెక్కిపట్టి యామత్స్యమునొక్కసారి గాకుండ అయిదారు సార్లుగొట్టెను. నేలంగూడగూలగొట్టెను. అంత ద్రౌపతిమిగుల సంతోషముతో హారము నెత్తుచుండెను. ద్రుపదుడును తగుప్రయత్నములో వివాహా మొనర్చుటకు సిద్ధముగ నుండగా, దుర్యోధనుడు మొదలగువారు చెలరేగి ద్రుపదుడు తమ్ము గౌరవము చేయుచున్నాడని యు తమనంటి గొప్ప గొప్ప రాజులనేకు లుండగా పేద బ్రాహ్మణుని కెవ్వరికో తన కూతునిచ్చి వివాహము జేయుచున్నాడనియు యలిగి యాబ్రాహ్మణులం బట్టి కొట్టబోయిరి పంచపాండవు లన్న సంగతి వారికి దెలియక యుద్ధముజేసి దెబ్బలుతిని దుర్యోధనాదులు పారిపోయిరి. ద్రుపదుడు కూతుతో సహిత మంతకు ముందే లోనికరిగెను.

పిదప పాండవులు తమతల్లియున్న కుమ్మర వానింటికి జనిరి. అటు పెనుక ద్రుపదుడు పేరివృత్తాంతంబు చారులు వలనవిని పాండ

వులని దెలిసికొని తన యంతఃపురమునకు రప్పించి కుంతి యనుమతి ప్రకారము తన కూతును పాండవులైదుగురికిని వివాహం బొనర్చెను. వివాహము జేసికొన్న తరువాత పాండవులు బ్రతికియున్న సమాచారము వినినందున దుర్యోధనుని గుండెలలో రాయిబడిపోయెను. అంతట ధృతరాష్ట్రుడు పాండవులను రప్పించి వారికర్ధరాజ్య మిచ్చెను. వారియర్ధరాజ్యమునకు ఇంద్రప్రస్థము ముఖ్యపట్టణము. ఇంద్రప్రస్థము మనహిందూదేశమునకు కేపిటల్ (capital) గానున్నడిల్లీకిసమీపమున నే పూర్వకాలమునందుండెను. పాండవులిచ్చోట రాజసూయ యాగమును జేసిరాజ్య మేలుకొనుచు సుఖముగ కాలక్షేపము జేయుచుండిరి. వారిసుఖమును, వైభవములను. చూచి దుర్యోధనుడోర్వ లేక శకునియను తన మేనమామవలన ప్రోత్సహింపబడి ధర్మరాజనుజూదమాడబిలువ ధర్మరాజంగీకరించెను. శకునిమాయవలనధర్మరాజు (యుధిష్ఠిరుడు) తనరాజ్యసర్వస్వము నోడుటయేగాక తన్ను ను, తనసోదరులను చిట్టచివర తన భార్యయగు ద్రౌపతిని గూడ నొడ్డి యోటువడెను అంతవారందరున్ను దుర్యోధనునికి. బానిసలయిరి. దుర్యోధనుని యాజ్ఞచే యాతని అనుజుడగు దుశ్శాసనుడు ద్రౌపతి నవమానింప దలచి యామెను రాజసభ కీడ్చుకొని వచ్చి యామె కట్టుకొన్న చీరెను బహిరంగముగా సభలో విప్పి వేసెను. ఆమె మహాపతివ్రతా శిరోమణి యగుట వలన భగవత్స్వరూపుడగు శ్రీకృష్ణుని ప్రార్థింపగా యాతడామెను గాపాడెను. చీరవిప్పితే మరియొక చీర యామెశరీరమున మెరయుచుండెను. ఇట్లెన్నియో చీరలువిప్పి ఇక విప్పనేరక ప్రాణమువిసిగి యామెను విడిచి వైచిరి. ద్రౌపతి యొంటినుండి విప్పిన చీరలు కౌరవుల భార్యల చీరలకంటె నెక్కువ యందముగా నున్నందునను నారదుని ప్రోత్సాహమువలనను ద్రౌపతి చీరలను గట్టుకొన దలచి తమచీరలు పూర్తిగా దగుల బెట్టుకొన్న యాకౌరవ సోదరుల భార్యలే యవమానపడిరి. ఎందుకన

ద్రౌపదిని విడువగానే యామె "అక్షయమగుగాక" యని తన తొడ మీద చఱచి వెళ్ళిపోగానే యా సభలో తన యొంటినుండి దీసిన చీర లన్నియు మాయమయ్యెను! ఆహా! ఆమె ఎంతటి పతివ్రత యైయుండక పోయిన నద్దుర్మార్గుల చేతులనుండి యవమానమును బొందకుండ తప్పించగలదు?

పాండవు లీవిధముగా రాజ్యంబునంతయు గోలిపోయి ద్రౌపదిని దీసుకొని పండ్రెండేండ్లరణ్యా వాసమును నొక్కయేడజ్ఞాత వాసమును జేసి వచ్చుటకై అడవులకు బోయిరి.

అడవులలో ద్రౌపదిగూడవారికష్టములనుపాల్గొనుచుకందమూలఫలములను భక్షించుచు, దుర్యోధనుడు బెట్టుకష్టము లనుభవించుచు, మునులు జెప్పెడు నలోపాఖ్యానము మొదలగు కథలను వినుచు, నెట్టులో 12 సంవత్సరములుగడపిరి. పదమూడవయేట తమ్మెవరును గుర్తింపకుండు నట్లు మాఱు వేషములు ధరించుకొని మారుపేర్లు బెట్టుకొని పాండవులు ద్రౌపతికి సైరంధ్రియను పేరు బెట్టి విరాటురాజువద్ద సేవ జేయుచుండిరి. అచ్చట ద్రౌపది సైరంధ్రి వేషమున విరాటరాజు భార్యకడ్డమైన చాకిరి జేయుచుండగా విరాటరాజు భావమఱదియగు సింహబలుడా ద్రౌపతిని మోహించి రమ్మని కోరెను. ద్రౌపతి మహాపతివ్రతయగుటచే తనభర్తలకెఱింగింప భీముడు వానిం జంపెను ఈరీతిగా 13 సంవత్సరములును గడపి పాండవులు ఇప్పుడైన మారాజ్యము నిమ్మనిరి? కాని దుర్యోధను డొప్పుకొన లేదు. పాండవుల సైన్యముచాల తక్కువైనను దుర్యోధనాదులతో యద్ధము చేయుటకై శ్రీకృష్ణని సహాయ్యము గలదు. కౌరవులకును పాండవులకును 18 దినములు యుద్ధము జరిగెను. తదనంతరము కౌరవులోడిపోగా ధర్మరాజు పట్టాభిషేకము చేసికొని రాజ్యమేలుచు సుఖింబుండెను. చూచితిరా యాద్రౌపతి తన పతులతో గూడ నెన్ని కష్టము లనుభవించినదో.

ద్రౌపదీదేవి చరిత్రము సమాప్తి.

# 11 చారుమతీదేవి చరిత్రము.

పూర్వకాలమునందు శోణపురమను పట్టణమున సర్వగుణాభి రాముండును వేదవిప్రుండునగు నొక బ్రాహ్మణోత్తముండు గలడు. ఆతనిపేరు కౌండిన్యుడు. అట్టిభూసురునికి చిత్తశుద్ధి గలిగినిర్మలవతి యైన చారుమతియను మహా పతివ్రత పత్నిగానుండెను ఆమె వేకువ జామున లేచి ప్రాతఃకాలాదిక క్రియలు నిర్వర్తించుకొని మగనిపాదములనుపూజించి అత్తమామల మాట కడుగు దాటక వారిచే మంచి గుణవంతురాలని పేరు వడసి యూరివారందఱి చేతను మంచిదనియు మహాయిల్లాలనియు ప్రసిద్ధి జెంది నిండుకాపురము జేసి కొనుచు కాలము గడపుచుండెను.

ఒక దినమున చారుమతి గృహకృత్యములు దీర్చుకొని భర్తశయ్యపై బండుకొని యున్నసమయమున తానును వాని ప్రక్కనిద్రించుచుండగా యామహావిష్ణువు భార్యయగు లక్ష్మీదేవి వర లక్ష్మీరూపముకొ వచ్చి యెదుట నిలబడి కలలో ఓ చారుమతీ! నేను గరుడయక్ష కిన్నెర కింపురుష గంధర్వాది దేవతలును పూజింప దగిన శ్రీమన్నారాయణుని భార్యను. వరలక్ష్మియనుదానను. నీపతివ్రతా మహాత్మ్యమునకు నీ పతిభక్తికి మెచ్చి నీకు వరములు నీయవచ్చితి. నీకు వలశిన వరములను తక్షణమే వేడుము. ప్రసాదించి పంపివేసెదనని జెప్పెను. అందులకా చారుమతి దేవీ! నాభాగ్యవశమున నిన్ను జూడగంటిని. నీదర్శనమే నాకొక గొప్ప వరము. నాకిదియే చాలును. వేరేవరములెందుకు? యింద్రాదులకైన గానరాని నీరూపము నాకు ప్రత్యక్షముగ కలలోగనిపించినది. నాకింతయే చాలు. అయినను నీవు వరమును వేడమంటివి గావున నీవు నేదలచు కొనునపుడెల్లను వచ్చి దర్శన మిచ్చి పోవ బ్రార్థించెదను. అని బద్ధాంజలి యైవేడెను.

అందులకు వరలక్ష్మి సంతోషించి యిట్లుజెప్పె, ఓ కాంతా ! నీవన్న నాకు మిక్కిలి కృపయు, దయయు, ఆదరణయు నున్నది, నీభక్తి విశ్వాసములు నామనస్సును సంతోషముగ జేయుచున్నది గావున నేను నీకెల్లప్పుడును సిరుల నిచ్చి నీకు సంతోషము జేసెద గావున నేజెప్పినట్లు జేయుము ఎట్లన భాద్రపద శుద్ధపౌర్ణమికి ముందు గావచ్చు శుక్రవారమున ఉదయముననే లేచి స్నానంబు జేసి యిల్లలికి ముగ్గుబెట్టి నాలుగు స్తంభములను నుంచి పత్రని తోరణంబులు గట్టి పందిట్లో బియ్యపు ముగ్గులను బెట్టించి పీటనుంచి దానిపై నరటాకు నుంచి తవ్వెడు పచ్చిబియ్యవూ యరటాకులో పోయించి చేతితో సమము జేయించి పంచకోణము బెట్టి కలశము నుంచి అందు వెండి, బంగారు లేక రాగితో నావంటి బొమ్మ నొకదానిని చేయించి యుంచి ఆప్రతిమ మీద, మఱ్ఱి, మోదుగ, రావి మేడిచిగుళ్లునుంచి నొకటెంకాయ నామధ్య యుంచి, కుంకమాక్షతలు పసుపునుంచి పువ్వులుజల్లి నల్లగాజులు, పూసలు, దువ్వెనలు, లక్కజోడు నుంచి రకమునకు తొమ్మిది చొప్పున పిండివంటలు జేయించియుంచి తొమ్మిదివంతుననే పండ్లను గూడనుంచి నూలుపోగులు తొమ్మిదిచొప్పున ముళ్లు బెట్టించి పసుపుబట్టించి కలశమునకు ముందర బెట్టి ధూపదీప నైవేధ్యములతోను తాంబూలములతోను పూజలు జేసి బ్రాహ్మణులచే నాశీర్వాదములంది వారికి ఫలములను దక్షిణతాంబూలముల నిచ్చి ప్రదక్షిణము జేసి మిగిలిన పదార్థములను బంధుమిత్రులకిచ్చి, యాకలశమున కెదురుగా నారాత్రి నేలమీదబవ్వళించి, నన్నుమరవక యుందువేని ధనకనక వస్తువాహనాదులతోను పుత్రుల తోడను సౌభాగ్యవతివై దులదూగెదవు అని చెప్పి యావరలక్ష్మి అంతర్ధాన మొందెను,

ఈవివరమును కలలో పరిపూర్ణముగా విన్న యాచారుమతి తా రాత్రి నిద్రపట్టక తెల్లవారగనే జరిగిన వృత్తాంత మంతయు న త్తమా

ములకు మగనికి జెప్ప వారు పురోహితులను రావించి యాశుక్రవారము నాడా వరలక్ష్మి జెప్పినట్లు యొక్కటియైన మరువక సాంగముగా చారుమతిచే జేయించి సుఖంబుండిరి.

అంత వరలక్ష్మి ప్రసాదమునను చారుమతి ప్రభావమునను కౌండిన్యుని యిల్లంతయు ధనకనక వస్తువాహనములతోను వజ్రవైఢూర్య గోమేధికములతో స్థాపితమైన యాభరణములతోను నిండి పోయెను. అప్పటినుండియు నాచారుమతికిన్ని వారిఇంటగల అందరికినిగూడ పరోపకారము జేయుట, సత్రములు గట్టించుట, చావళ్లుగట్టించుట, పెండ్లిండ్లు సేయించుట యందును సంతోషమధికమయ్యెను. మరియు పుణ్యమతి పతివ్రతయగు చారుమతి పుత్రులను పుత్రికలను గని తుదకువిష్ణు సాయుజ్యమంది అచ్చోటను భర్తతో మరు జన్మ లేక యుండెను. కావున స్త్రీలు తమ భర్తలే దైవంబని యెంచి పుణ్యకార్యములు సత్యవ్రతములు జేసి చారుమతీదేవి వలె నైశ్వర్యములను పొందెదరు గాక.

చారుమతీదేవి చరిత్రము సంపూర్ణము.



# 12 దేవహూతిదేవిచరిత్రము.

పూర్వము బ్రహ్మదేవుని యాజ్ఞప్రకారము ప్రజలను సృష్టించుటకై కర్దముడను ఋషిసత్తముడు బదివేల సంవత్సరములు సరస్వతీనదీతీరంబున తపస్సు జేయగా నాతని తపఃప్రభావముచే నాతడు స్వాయంభువమనువునకు పుత్రికయగు దేవహూతిని కళ్యాణము జేసికొనెను. పిదప నాదేవహూతిదేవి త్రికరణశుద్ధిగా భర్తయే దైవంబని దలంచి షోడశోపచారములు సేయుచు నతని కిష్టమువచ్చునట్లు మృదుమధురవాక్యంబులు బలుకుచు, పతిమాట కడ్డముచెప్పక కామక్రోధలోభ మోహమదమాత్సర్యములనెడి యార్గురు శత్రులను విడచి సుగుణంబులచే నెల్లప్పుడు తన ప్రాణేశ్వరుని కిష్టముగ ప్రవర్తించుచుండెను. ఈవిధముగ రాత్రింబవళ్లు భర్తకుపచారముజేయుచు భర్తనే పరబ్రహ్మస్వరూపంబుగ ధ్యానించుటవలన శరీరము సుష్కించి యావంతయేనియు బలము లేకయున్న భార్యనుజూచి మిగులజాలి నొంది కరుణాన్వితుడై ఓప్రాణకాంతా! భర్తయగు నన్ను దైవసమానునిగ మనంబునదలంచి అహోరాత్రములు తదేకధ్యానంబుగ నుండుటవలన మిక్కిలి శుష్కించిపోతివి. నీ నిశ్చలభక్తికి నేను గడు సంతసించితిని. గావున నీవు నన్ను కిష్టమగు వరంబుల నిచ్చెద కోరుమని కర్దముడు నుడివెను. అందుల కాదేవహూతి దేవా! కామక్రోధలోభాదులతో మిళితమై నిముషభంగురములగు నీటిబుడగవంటి యీసంసారములో మునిగి తేలి మోక్షంబుసాధించు నుపాయమును దెలియనేరక మూఢులై అహంభావముతో నీది, నాది, నేను, నీవు, అను వ్యత్యాసములను బెట్టికొని జనులు వివేకశూన్యులైయుందురు. అట్లుగాక యేపుణ్యాత్ముని పాదములను దర్శించినంతమాత్రమున

భవబంధములు తప్పిపోవునో ఎవ్వడు సచ్చిదానందస్వరూపుడో యట్టి పరబ్రహ్మస్వరూపుడు నాగర్భమున బుట్టునట్లు నాకు వరంబు ప్రసాదింపుడని వేడెను.

అంత నాకర్దముండను ఋషి యామహాపతివ్రతాతిలకంబును వీక్షించి సఖీ మంచివరంబును గోరితివి. బ్రహ్మాదులకుగూడ శక్యముగాని ఫలంబులగోరితివి నాకును గడుసంతసంబయ్యె. అట్లే నీకోరిక ప్రకారము సచ్చిదానంద స్వరూపుడగు భగవంతుడు నీకు తనయుడై బుట్టి యాతని యుపదేశంబుల వలన సాయుజ్యపదవిం బొందుట కావంతయేనియు సందియములేదని వరంబిచ్చెను. అంత నాదేవహూతి గర్భముదాల్చి పరబ్రహ్మస్వరూపుండగు నామహావిష్ణువులను గని యాతనికి కపిలుడను నామకరణం బొనర్చిరి.

పిదప కొన్నినాళ్లకాతడు బెరిగి పెద్దవాడుకాగా దేవహూతి తన పుత్రుంగని నట్టిపుత్రుని పరబ్రహ్మంబని యెఱింగి సాష్టాంగదండప్రణామంబులాచరించి యతని వేనోళ్ళబొగడి యతనితో నిట్లుపలికెను. దేవా! నీకు జనకుండును నాకు భర్తయునగు కర్దమ ప్రజాపతిచే భవభయనివారంబునకును కైవల్యపదవి జేరుటకును. నాకొక్కవరంబిచ్చె. ఆవరప్రకారము నిన్నుంగంటిని. కావున నట్టి తత్వలక్షణంబులు నాకు జెప్పి నన్ను కృతార్థురాలినిగా జేయుమని వేడగా నాకపిలుండు అమ్మా నీబుద్ధికి గోచరమగునటుల నుడివెద సావధానముగా వినుమని యాలక్షణంబుల ప్రభావంబులను గూర్చి భగవంతుడెట్టివాడో నాతని నెట్లుయారాధించుటవలన జీవులు ముక్తిమార్గము నొందెదరో మున్నగువిషయములను గూర్చి పూర్తిగా బోధించెను. అంత నాదేవహూతి భక్తియోగమునుగూడ నెఱింగింపుమని వేడగా కపిలుండు తిరిగి యిట్లుచెప్పెను.

అమ్మా సతికి పతియే పరమదైవంబు. అట్టిభర్తను మనస్సున నిలిపి నిశ్చలమతితో పాతివ్రత్యప్రభావములనుగూర్చి శ్రవణానంద ముగ వినుచు, సర్వము భర్తృప్రీతియని భావించి నిష్కామియై యెట్టిస్త్రీ చరించునో అట్టినారీమణులు అష్టవిభులంగూడి సదానంద వైభవమగు కైవల్యపదవి నందెదరు. మరియు బంధువులు స్నేహితులు, భూమి, ధనము, మొదలగునవన్నియు నస్థిరములు; దేహములు నీటిబుగ్గలవంటివి; జీవము క్షణభంగురము. కావున నిత్యమును భగవధ్యానమే ప్రధానము. అట్లుండువారికి కైలాసము కరతలానులకము అనిచెప్పగా విని నాదేవహూతి తనయునితో దేవా! నాపురాకృత ఫలముచే ప్రణవస్వరూపుడవగు నిన్ను పుత్రునిగాగని నీ పదారవింద ములను దర్శించగల్గితిని. నీచే యాత్మతత్వమును. శరీరతత్వమును, భక్తిమార్గమును, పాతివ్రత్యప్రభావమునుగూడ వింటిని. మోక్షమును గంటిని. అని యనేకవిధముల నుతించి భక్తితో పతిభక్తిజరపి భూలోకమునకు శీలుగాని సంపద లనుభవించి పిదప పరబ్రహ్మమునం దైక్యమయ్యె.

దేవహూతి దేవి చరిత్ర ముగింపు.



# 13 చంద్రవదనాదేవి చరిత్రము

అనేకవందల సంవత్సరముల క్రిందట చంద్రశేఖరుండను నొక భూపాలుడు కాశ్మీరదేశమునేలుచుండెను. అతనికి మిక్కిలి సుగుణవతి యగుచంద్రవదన యను నొకముద్దుల కుమార్తెగలదు. ఆమెచిన్నతనము నుండియు గూడ పురాణకృత ఫలము నవలభించిన జ్ఞానము వలన నీలోకమే కల్లయనియు బంధువర్గము సఖులు పుత్రమిత్ర కళత్రాదులు వెంటరారనియు యిట్టిమాయప్రపంచము యొక్క సుఖముపై ఆశయుండుట కేవలము మూఢత్వమనియు సచ్చిదానంద స్వరూపుడగు భగవంతుని నిశ్చలమనస్సుతో బూజించుచు తన చెలులకు జ్ఞానమార్గం బుపదేశించుచు కాలము గడుపుచుండెను. అంత గొన్నాళ్లకు యౌవనమంకురింపగా నొక్కనాడామె తండ్రి యాజ్ఞచే భృగుమహర్షి యామె యంతఃపురమునకు జని యామెచే నర్ఘ్యపాద్యాదులంది యుచితాసనంబున గూర్చుండి యామె జేసిన యుపచారములకు మెచ్చి ఆమెతో నిట్లనియె.

తల్లీ! నీయుపచారంబులకు మెచ్చితి గావున వలసిన వరంబు ప్రసాదించెద వేడు మనిన యాచంద్రవదనతాపసేంద్రా, నాకు మోక్షసామ్రాజ్య పదవి నియ్య వేడెదననెను. అంతనా ఋషి పుంగవుండు ఓ కన్యకామణి! మంచి కోరిక నడిగితివి గావున జెప్పెదవినుమనియామె మొగంబున విభూతినిడి పంచాక్షరీ రాజమంత్ర ముపదేశింప భగవంతుని రూపరక్షణంబుల వివరించి జీవాత్మకు పరమాత్మకు గల వత్యాసముల బోధించి మరియు పతియే దైవంబని భావించి నిశ్చలమనస్సుతో నానావిధోప చారముల నతనిసంతోష పెట్టి పతి చరణములే గతియని ధ్యానించు చుండినచో నీకు తప్పక కైలాసపదవి లభ్య

మగునని జెప్పి యాఋషిశ్రేష్ఠుఁడు తన యాశ్రమంబునకు జనియె. అం తటి నుండియు నాకన్యకామణి సర్వకాలసర్వావస్థల యందును యతి జెప్పిన యామంత్రమునే జపించు చుండెను.

పిమ్మట నొకనాడు చంద్రశేఖరుండు తన పుత్రిక యంతఃపుర మునకుఁ బోయి, అమ్మా! నీకు వివాహకాల మాసన్న మైనది. నీవు సన్నేవని యందు లీనమై యున్నదో దెలిపిన నట్టివాడా దేవేంద్రుడై నను దక్షిణముదెచ్చి కళ్యాణమొనర్చె దననెను. అందులకా చంద్రవదన తండ్రీ! విద్యలేనివాడు వింతపశువన్న సామెత ప్రకారముగా విద్యలేని వాడెంత ధనవంతుడైన నేమి ఫలము. మిగుల విద్యనేర్చిన వానిని దె చ్చి నాకు వివాహంబు జేయుము. అట్టి విద్యనేర్చిన వారలలో నెవ్వ డీ క్రింది యైదు ప్రశ్నలకు తగిన జబాబిచ్చునో వానిని దక్క నితరు లను నేవివాహ మాడను. ఆ ప్రశ్నలివి :—స్త్రీలు దేని మూలమున స్వర్గ పదవి ననుభ వించెదరు ? 2 స్త్రీలకు భూషణ మెయ్యది ? 3 జీ వాత్మకు పరమాత్మకు గల వ్యత్యాస మేది ? 4 లింగ దేహం బెట్టిది ? 5 మానవు లెట్టి కర్మవలన విముక్తి నొందెదరు ? తండ్రి తనగారాబం పు పట్టి జ్ఞానమునకు కడుంగడు మెచ్చి యట్లే రాజపుత్రు లందరిని త న గృహమునకే రప్పించి యాప్రశ్నలకు సమాధానము లను వ్రా యించి తన కూతునకు జూపెను. అందొక్క రాజ పుత్రుడు, విందా ఖ్యు డను వాడు, అది వరకే పాంచాల రాజ పుత్రికయగు చిత్రాంగ దను వివాహము చేసి కొని యున్నవా డిట్లు జబాబులు వ్రాసెను. మొదటి ప్రశ్నకు జబాబు "పతివలన". 2 వ ప్రశ్నకు "మానము" 3 "జీవాత్మ తామరాకు వంటిది పరమాత్మ యాతామరాకులో నీటివ లె యంటక యుండునది" 4 "భగవంతుని ప్రకృతి రూపము" (5) ఫ లము గోరక జేయు పుణ్యముల వలననే.

ఈ జబాబులు విని చంద్రవదన మిగుల సంతసించి యట్టివాడు మొదట వివాహము జేసి కొన్నను అట్టి వానినే తనకు వివాహంబు జేయు మనెను. తండ్రియు నందుల కంగీకరించి వింధ్యాఖ్యుని రప్పించి యతని, నాచంద్ర వదనకిచ్చి డెబ్బది యాగంబుల పెండ్లి సేయించెను. అంతనా సతీపతులు కొన్ని దినంబు లచ్చటనే కేళీవిలాసముగా కాల ముగడపి తరువాత పాంచాల దేశము నందున్న తన మొదటి భార్య పుట్టినింటికి రెండవ భార్యను వింధ్యాఖ్యుడు చేసికొని వెళ్లి యచ్చోట గొన్ని దినంబులుండి మంత్రిసామంతాది దాస దాసీ జనంబుల గూడి మొదటి పత్ని యగు చిత్రాంగదను దోడ్కొని పయనమై తన దేశ మునకు బోవుచు మార్గంబులో యినుడస్త్రాద్రి జేరినందున నారేయి యా యరణ్య మందు విడసిరి. అంత దేవ వేశ్యలగు రంభ, మేనక, ఊర్వశి, తిలోత్తమ మొదలగు వారా మార్గమున పోవుచు చంద్ర వ దన రూపమున తమ కంటె మిగుల సౌందర్యముగా నున్నది దీనిభర్త ను మనము మన నిలయమునకు గొని పోయినచో పతి విరహంబున శరీ రము శుష్కించి వికారరూపము గలది. యగునని యోర్వలేని తనము న వింధ్యాఖ్యుని గొని పోయి యా వేశ్యలాతని వరుసగా భోగించు చుం డిరి. ఆమాయను దెలిసి కొన్న వింధ్యాఖ్యుడు తన భార్యలను విడిచి వచ్చిన సంగతి జ్ఞప్తికి దెచ్చుకొని విచార సాగరమున నోలలాడు చుండెను

అంతే నర్ధరాత్ర మగుసరికి చంద్రవదనయు చిత్రాంగదయు స వతు లిద్దరును మేల్కాంచి జూచు సరికి తమభర్త గాన్పించక మనంబు లం మిగుల విచారము నొంది మూడు దినంబు లచ్చోటనే నిద్రాహార ములు మాని యుండిరి. అంత నేమియును దోచక చిత్రాంగద తన సవతినిగాంచి చెల్లెలా ! మనమిట్లుదుఃఖించిన నేమిఫలము ? మాపుట్టిం టికి బోయి మనమచ్చోటనుండి వెతకింతము రమ్మన చంద్రవదన యం

దులకంగీకరింపక అక్కా ! మనభర్త యిచ్చట లేనిసమయమున సాహసించి మన మేకార్యమును చేయరాదు. ఘనము పతివ్రతా శిరోమణుల మగుదుమేని పతియేలరాడో చూచెదముగాక ; నేనాలోచించి చూడగా ప్రాణేశ్వరుం డుత్తమలోకమున నున్నట్లు తెలియవచ్చినది. నీకు బోవలెననియున్న నీపుట్టింటికి బొమ్మనెను. ఆమెయు నిన్ను విడచి పోజాలనని జెప్పినదయ్యును కాశ్మీరాంధ్రపాంచాల దేశమునకు జని జరిగిన వర్తమాన మంతయు చారులకు జెప్పి వెదకి కొనిరండని పంపించెను.

కాని చంద్రవదన పతినే దైవంబుగా దలంచి పతిపదారవిందంబులను డెందంబున నునిచి ఇంద్రియవ్యాపారమును మరచి భర్తనే స్మరించుచు ౩౨ దినములుండగా నాపరమసాధ్వియొక్క పాతివ్రత్య మహిమంబున ప్రళయకాలాగ్నివలె నగ్నిప్రజ్వరిల్ల అష్టదిక్కుల బొగ లేచి లోకంబంటసాగెను. అంత దేవతలచే ప్రార్థింపబడి దేవేంద్రుడాలోచింపగా నది యొక్క పతివ్రతాప్రభావంబున కలిగిన యగ్నియని దివ్యదృష్టిచే గనిపెట్టి తనదేవ వేశ్యలను రప్పించి వారిని పలు విధముల దండించి విందాఖ్యుని తన విమానమున గూర్చుండబెట్టుకొని, యాపతివ్రతాతిలకము వద్దికి గొనిపోయి, అమ్మా ! నీపతిని దీసికొని వచ్చితిని. ఇక మంటలను జల్లార్పుము. నీప్రభావంబుమా దేవవేశ్యలకు దెలిసినదికాదన యామె నిష్టజాలించి కండ్లుదెఱచి విందాఖ్యుని పాదంబులకు మ్రొక్కినది. అంతట యగ్ని జల్లారగా దేవేంద్రాదులు తమనిలయములకు జనిరి. రంభ యూర్వశి తిలోత్తమ మేనకలుగూడ నాపె పాదములకు మ్రొక్కి, శపింతువేమో వద్దు తల్లి ! యనివేడి వెడలిరి. అంతట విందాఖ్యుడు చంద్రవదనను, చిత్రాంగదను దోడ్కొని తన యాంధ్రదేశమునకు బోయి తండ్రి

యనుమతిచే పట్టాభిషిక్తుండై చాలకాలము రాజ్యమేలి అష్టయిశ్వర్యంబుల దులదూగి సతిపతులు మోక్షసామ్రాజ్యము నొందిరి. గావున యువతులు తమభర్తలను దైవముగా జూపింతురుగాక.

చంద్రవదనాదేవి ప్రభావము అంత్యము.



# 14 లోపాముద్రాదేవి చరిత్రము

బహుకాలము క్రిందట విదర్భనేలు రాజోత్తమునికి లోపాముద్ర యను నొక జక్కని కుమార్తెగలదు. ఆమె మిగుల సుగుణవతి. పరమశాంతురాలు. భూతదయ గలది. సమస్తవిద్యలయందారితేరినది. ఇట్టి కాంతామణి పెద్దలవలన పతివ్రతల చరిత్రలను వినుచు చెలికత్తెలతో సత్కథాగోష్ఠిని కాలము గడపుచుండెను.

అంత నొకనాడు అగస్త్య మహాముని యారాజసభకు వచ్చి రాజుచే నర్ఘ్యపాద్యాదులొంది యుచితాసనముపై గూర్చుండి రాజా! నేను నిన్నొక్కటి యాచింప వచ్చితిని. దానిని నీవు తప్పకయిచ్చెదనంటేనేని గోరెదను. నీవాడితప్పని వాడవు; అనగా విని, రాజు తప్పక గోరు మిచ్చెదనని వాగ్దానము జేసెను. అంత నయ్యగస్త్యుడిట్లు వానుచ్చెను. నృపాలా! నేను నిద్రించుచున్న సమయంబున నాపితృదేవతలు కలలో ప్రత్యక్షమై నాకిట్లు జెప్పిరి. అన్నా నీవు చాలకాలమునుండి వివాహము జేసికొనక బ్రహ్మచారివై యుంటివి "అపుత్రస్యగతిర్నాస్తి" యను వేదవాక్య ప్రకారము సంతానము లేనివారికి మంచిగతి గలుగనేరదు. నీవు మా కేడవ తరమువాడవు. వెంటనే వివాహం బొనర్చికొని మమ్ముద్ధరింపుమని చెప్పి యంతర్ధానమైరి. గావున నోరాజా! విద్యావతి, రూపవతి, గుణవతియగు నీపుత్రికను నాకిచ్చి కళ్యాణమొనర్చుమన యాభూమీశుడు మొదలు నఱికినవృక్షంబువలె నేలంగూలి మూర్ఛిల్లెను. అంత నాతని మంత్రులు భృత్యులు మొదలగు వారాతని పల్లకిలో నిడికొని యంతఃపురమునకు గొనిపోయి యచ్చోట నుపచారముల సేదదేర్చిరి.

పిదప గొంతసేపటికా పుడమీశుడు మూర్ఛనుండి తెల్విగాంచి చూచితిరా! మంత్రిప్రధానులారా, వనవాసియు, నిరుపేదయు, జడదాల్పరియునగు యీబాపనికి నాముద్దుల కూతు నియ్యవలెనట! "నక్కయెక్కడ! నాగలోకమెక్కడ" తారతమ్య మెంచక యిట్టి కూతగూసిన సన్యాసి నేమిచేయవచ్చునని మిగుల కోపమనస్కుండై పలికెను

ఆమాటలు విని మంత్రిప్రధానులు రాజేంద్రా! ఆముని సామాన్యుడు గాడు. ఎందుచేతనన సముద్రములోని నీటినంతయు పురిపిటబట్టినాడు! ఇంద్రద్యుమ్నమహారాజును మదపుటేనుగగునట్లు శపించెను. వింధ్యపర్వతముయొక్క గర్వముడిగించి సూర్యచంద్రులకు స్వేచ్ఛాసంచారమును గల్పించెను. అట్టి మహామునికి ముల్లోకములు గడగడ వణకుచుండును; గావున నాతని నిట్లు హేళనముగా బలుకుట ధర్మమా? యనిరి.

ఈసమాచార మంతయు నామూలాగ్రముగ విన్న యీరాకుమార్తె తనజనకుని వద్దకు వచ్చి, తండ్రీవలన గూడనావృత్తాంతంబు విని నాయనా! ఇట్టిముని మనయింటికివిచ్చేసి యిట్లడుగుట మనపూర్వజన్మ సుకృతముగాక వేరే! ఇతడు పరమ తపోధనుడు గాని సామాన్యుడుగాడు. ఈబుమిదయమునకు గలిగిన మనకు పునర్జన్మమే యుండదు. తనకు తానే కన్యనిమ్మని వచ్చెగావున నన్నితనికిచ్చి వివాహంబు సేయుము. ఆడితప్పరాదు. అనిచెప్పగావిని తండ్రి గారాబంపు పట్టీ! యిట్టి వికారస్వరూపుండగు బాపడుదక్క మరియెవ్వడునీకు దొరకడనుకొంటివా? నీవతనిపై యాశ విడువుము నేను చక్కని వరుని దెచ్చెద చూడు మన తండ్రీ నీకొక్క చక్కని యుదహారణ జెప్పెదను వినుము. పూర్వము మాంధాతృయను రాజశ్రేష్ఠుని యొద్దకు సౌబరియను నొకతపశ్శాలి వచ్చి యారేబదిరెండ్గుల పుత్రికలలో నొక్కతెను తనకిచ్చి వివాహము

జేయించుమనెను అందులకా భూమీశుడు ఋషివరా ! నాపుత్రికలలో నెవ్వతె మిమ్ము వరించునో యట్టిదానిని మీకిచ్చి తప్పక కళ్యాణ మొనర్చెదనని చెప్పగా యామునీంద్రుడు సమ్మతించెను. అంతనా రేనికి గల యేబదిమంది కూతులును ఆమునీంద్రుని మోహించగా మాంధాత తన యభిప్రాయము గొనసాగమిచే వంతనొంది యాపుత్రికా రత్నంబులనాతని కిచ్చి వివాహంబుగావించెను. అనివినియున్నాను. గావున తండ్రీ మాఱు బల్కక నన్నతనికిచ్చి వివాహము సేయుమన విదర్భేశుడందులకంగీకరించి డెబ్బదియాగంబుల తనకూతునాయగస్త్య నకిచ్చి వివాహమొనర్చి ఆరునెలలు తనగృహంబుననే యావధూవరుల నుంచికొని పంపివేసెను.

అటుపిమ్మట లోపాముద్రాదేవి తన పతినిదైవంబుగ బూజించుచుండుటగని అగస్త్యుడొకనాడామెనుజూచి కాంతా నీవు నాకు గావలసినన్ని యావుపాలు దెచ్చి దాహామునిచ్చెదవా ? యని యడుగ, నాతనిభార్య ప్రాణేశ్వరా ! నేను మీదాహాము దీర్చునన్ని యావుపాలను దేగలనా ? నాకు మీపాటి మహిమ యెక్కడిదని చెప్పియొక సువర్ణపాత్రను పరిశుభ్రముగ గడిగి దానినిండ గోక్షీరంబుబోసి దానిని క్షేయంబగు నటుల మంత్రించి యాక్షీరపు పాత్రను వానికిచ్చెను. ఆముని దానిలోని పాలనుద్రావుచుండ నవియెప్పటికిని దరుగకుండుట కాశ్చర్యపడెను.

పిమ్మట అగస్త్యుడొకనాడు తన భార్యంగని కాంతా ! నాయాశ్రమంబునకు బోవుదము వచ్చెదవా ? యనియడుగ యామెయు సరేయనెను. అంత వారిద్దరును గలసి అగస్త్యుని యత్తమామలవద్దకు బోయి దమ ప్రయాణపుసంగతి జెప్పి సెలవు పుచ్చుకొనిరి. అప్పుడు లోపాముద్రనగరవాసమున నెట్లుండవలెనో యరణ్యవాసమున నెట్లుండవలెనో ఘటించి యున్నదికావున యమూల్యమగు వస్త్రాభరణంబు

లను విడచినారబట్టలను ధరించుకొనిపోయెను. కొన్నాళ్ళకామె గర్భం బుదాల్చి మహా తపోధనుడగు నొక పుత్రునిగనెను. అంత నమ్ముని బ్రహ్మానందమునుబొంది తన భార్యతో నబలా! మనపుత్రోత్సవంబునకు వేన వేలు ఋషులు వచ్చెదరు. నీవువారికి తగు మర్యాదలొనర్చి తృప్తిపరచి పంపవలయునని చెప్ప నక్లోవలసిన పదార్థములన్నియు నాయత్తము చేసుకొని వచ్చిన మునులకు బిక్షము బెట్టె. వారును అమ్మాహాపతివ్రతను, ఆశిశువును దీవించిపోయిరి.

ఇట్లుండగా నొకదినంబున విపులుండను మహాఋషి తనభార్యయగు విమలాంగితోగూడ అగస్త్యాశ్రమునకు వచ్చెను. అంతనాదంపతులు వారియతిథులకు నమస్కరించియర్ఘ్యపాద్యాదు లిచ్చి బూజించి యుచితాసనంబులగూర్చుండ బెట్టగా విమలాంగి లోపాముద్రంగాంచి యిట్లనియె, అమ్మా నీవు మహా రాజ కుమారివై యుండియు ధనకనక వస్తువాహనంబులను, పట్టుదుకూలమును, విడిచి నారబట్టలు ధరించి యట్టివి దెచ్చినచో మాబోటిబీదల కియ్యవలయు ననిజడిసితివి కాబోలు అట్టినగలులేనిచో నాకిప్పుడేమి యిచ్చెదవన, అమ్మా నీకేమి కావలయునో గోరుము వాటినెల్లనిచ్చెదనన, తల్లీ నీసొమ్ములనెల్ల నాకిమ్మని కోరెను. అంత లోపాముద్ర యొకచెట్టుజూపి నావస్తువులనెల్ల దీనిని వేల గట్టితిరమ్మని వలసినన్ని యాభరణము లిచ్చెను. వారామె నాశీర్వదించితమ యాశ్రమంబులకుజనిరి. గావున కాంతలు లోపాముద్రవలె సత్యమును, శీలమును, దయ, ధర్మముగల్గి పతులనే దైవంబులుగ దలంచెదరు గాక.

లోపాముద్రాదేవి చరిత్రసంపూర్ణము.



# 15 ప్రభావతీదేవిచరిత్రము

———:○:0:○:———

పూర్వము చంద్రశేఖరుండను సూర్యవంశజుఁడు పాటలీపురమును మిగుల ధర్మముగ బరిపాలనము సేయుచుండెను. ఆతేనికి ప్రభావతియను నొక కుమారీరత్నము గలదు. పసితనమునుండియు నామె జ్ఞానసంపత్తిగలిగి పతివ్రతాధర్మములను బాగుగాఁ దెరింగి వేదశాస్త్రపురాణములను గూడ దెలిసికొని సుగుణములకు నాలయమై రూపురేఖావిలాసలయం దతిశయించి యుండెను. అంత కొన్నిదినముల కాప్రభావతికి యౌవనము బొడసూపెను.

ఒకదినమున చంద్రశేఖరుండు తన పుత్రికనవ్వీక్షించి అమ్మా నీకు కల్యాణసమయము వచ్చినది. నీవెవ్వరినికోరెదవో దెల్పిన నట్టి వానిని దీసుకొనివచ్చి మహోత్సవంబుగా నీకు వివాహంబుగావించెద నని వాక్రుచ్చెను అందులకాచిన్నది, జనకా! లోకమునందును కులదాంపత్యము కుదురుట మిగుల దుస్తరముగానున్న నాకు బెండ్లి యెవద్దు. నేను పతివ్రతామాహాత్మ్యములకోడను వేదపురాణేతిహాసములు జదువుటచేతను కాలముగడిపి పునర్జన్మలేని మోక్షమునకు బోవలెనని యున్నదన, నాతఁడా వృత్తాంతంబెల్ల నాతనిపత్నికి జెప్పి, అక్కటా! లేకలేక యొక్కపుత్రికంగని చాల గారాబముతో బెంచి యుక్తవయస్సున బెండ్లిచేసి ఆనందమును బొందవలెనని గంపెడాశతో నుండగా, నాకుమారీరత్నము తనకు వివాహమేవద్దనెప్పుచుండె; నిక యేమిసేయువాడనని నిద్రాహారములు మాని మిగుల దిగులుం బొందుచుండెను.

అంత నొకదినంబున నారదమహాముని యతనివద్దకు విచ్చేసి చంద్రశేఖరునిచే నర్ఘ్యపాద్యాదులంది యుచితాసనమున గూర్చుండి,

ఓ భూమీశా ! కుశలమా ? యనియడుగ నందులకా పుడమీశుడు తాపసోత్తమా ! త్రిలోకసంచారులగు తమకుదెలియని విశేషంబులుండునో? అంతయు దేవరకే గోచరమనిబల్కెను. అందుకా మునినీవువిచారింపవలిసిన బనిలేదు. నీకొమరితకెవ్విధంబుననైన వివాహాపేక్ష బుట్టునట్లు జేసెదనని ధైర్యముజెప్పి ప్రభావతి యంతిపురమునకు తానొంటరిగ జని, యామెచే నర్ఘ్యపాద్యాది విధులచే బూజింపబడి యొకపీఠంబున విశ్రమించి యాప్రభావతింగని అమ్మా ! చతురాశ్రమములలో గృహస్థాశ్రమమే మిగుల ప్రశస్తము గావున స్త్రీ అట్టి యాశ్రమమున నుండియే మగని దైవంబుగ దలంచి త్రికరణశుద్ధిగా నాతని షోడశోపచారంబుల బూజించి నిరంతరము పతిపదరాజీవముల భక్తియే యిహపరలోకముల సుఖమనుభవించుటకు మార్గమని నెఱిం నమ్మి మగనిచే జ్ఞానమార్గంబునుం బడయుచు పతిని దైవముగనమ్మి స్మరించుచు కాలముగడపినవారికి మోక్షసామ్రాజ్యం బరచేతిలోని రేగుపండువంటి యగును. మఱే యేయుపాయముచే.నైనను యింతులు మోక్షపదవినందుట దుర్లభము గావున నోకాంతా ! శీఘ్రముగ నొక దివ్యపురుషుని బెండ్లియాడి సద్గతింబొందుమని పలికి నమ్మునిశ్రేష్ఠుడు వెడలిపోయెను.

అంత గొంతవడికి చంద్రశేఖరుడు వచ్చి తన పుత్రికతో అమ్మా ! వింటివికదా, ఋషిపలుకులు. ఇకనైన నామాటలువిని శీఘ్రగతిని వివాహము జేసికొనుమన, ప్రభావతి తండ్రింగాంచి, జనకా ! సరే సకల విద్యాపరిపూర్ణుండును మిగుల జ్ఞానవంతును, భూతదయాళునునై దేశాటనము సలుపునట్టి వానిని దీసికొని వచ్చినచో దప్పక వివాహమాడెదనని నుడివెను.

అట్లుండ నొకనాడు సకల విద్యాగరిష్ఠుండగు మగధరాజ సుతుడగు చిత్రకరుండు చిన్నతనమునుండియు దేశాటనము జేయుచు

నాపాటలిపురంబునకు వచ్చి యచ్చట ప్రభావతిని గూర్చి సాంగోపాంగంబుగవిని యానందంబొంది రాజసభకు జని తనయుద్దేశ్యము నెఱింగించ రాజాతని సమాచారమును ప్రభావతికెఱింగించెను. ప్రభావతియు నాతడు వయోరూపవైభవ విద్యలయం దామెకు దీసిపోడని గ్రహించి యాతని వివాహమాడుట కంగీకరించెను. కాబట్టి యానరేందుద్రుడు ప్రభావతి నీతనికిచ్చి పాణిగ్రహణ మొనర్చెను.

వివాహమైనదాదిగ ప్రభావతిని పతిపాదారవిందంబులనే భగవత్స్వరూపముగ దలచి నతనికిష్టమగు పనులనే సదా జేయుచు నహోరాత్రములు భర్తనే స్మరించుచు కాలము గడపుచుండెను. గొన్నినాళ్ళత్తవారింట వినోదముగ గాలముగడపి భార్యయేమి చెప్పునో చూతమని చిత్రకరుం డొకనాడు ఆమెనుగాంచి ప్రాణనాయకీ ఇక మనదేశమగు మగధకు బోదమని చెప్ప నామెయు నందుల కొడంబడెను. అటుపిదప వారిద్దరు చెఱియొక హయంబునెక్కి యరణ్యములంబడి ప్రయాణముసేయుచు మృగములను వేటాడుచు, కుముదాకరములయందు జలక్రీడలాడుచు, శకుంతసంతానముల యారావములను విని సంతసించుచు, నచ్చోటి పుష్పఫలతరువులం గూర్చి ముచ్చటించుచు, మిగుల వినోదంబుగ కాలముగడుపుచు, నొక్కనాడొకానరమందొక వృక్షంబు చాయనుబండుకొని గాఢనిద్రా పరవశులైరి. కొండొకవడికి భర్తలేచి యింకను గాఢనిద్రలోనున్న భార్యను ప్రభావతిని, గని ప్రభావతీ! ప్రభావతీ' ప్రభావతీ! యని మూడుసార్లుబిలిచి నామె పలుకనందున నదియొక నెపముగా బెట్టిగొని రయంబున తన యశ్వంబునెక్కి తివ్వనబోయి మగధదేశము జేరెను.

భర్త బయలువెడలిన నొకక్షణమునకు ప్రభావతియు నిద్రనుండి మేల్కాంచి తనప్రక్కలో చిత్రకరుండు లేకుండుటజూచి చింతాక్రాంత చిత్తయై, యాకాననమంతయు గలయ గ్రుమ్మరి,

యచ్చోటనుగూడ గానక, మిగుల దుఃఖించి ఓ ప్రాణకాంతా ? నీవు నన్ను బరిహాసము చేయుటకై నిందెచ్చోటనో డాగియుంటివి గాబోలు, నిక రమ్మనియు, ఓయరణ్య మృగములారా ! మీరైన నా నాథుని జూపరాదా ? యనియు నడిగి యెచ్చటను లేనందున, నీతడు తప్పక మగధ దేశమునకుబోయి యుండవచ్చును అని దలంచి రయంబున నాహాయంబు నెక్కి పురంబుకు భర్తపై మనంబుతో బోవుచుండెను. అట్లు బోవుచుండగా మార్గమధ్యమున గొందరు తస్కరు లామెనుగాంచి చీకటిలో నామె దేవతా స్త్రీయో మనుష్య స్త్రీయో గుర్తుపట్టనేరక ప్రక్కకువచ్చి ఓకామినీ ! నీవెవ్వరవు ? ఇట్లొంటరిగా నీనిర్జనారణ్యమున నేల ప్రయాణము సేయుచుంటివని యడుగ యామె వారిని తస్కరులనుగా భావించి తననాథుని దలంచి తనమాంగల్యమును ద్రెంచి వారిపైపునకు విసరివేసెను. ఆమంగళసూత్రము వారినందరిని భస్మీకృతులనుగా జేసి తిరిగివచ్చి ప్రభావతి కంఠంబు నందుండె. అటుపిమ్మట నామాంగల్యంబును ధరించి ఎండనక వాననక, గుట్టనక మెట్టనక, గొయ్యనక గొప్పనక, తనయశ్వంబున గూర్చుండి బోవుచుండ, మార్గమధ్యంబున నొక ఋషియాశ్రమము గాన్పించెను. అంత నాఋషికి వందనము లర్పించి యా ప్రభావతి తనకష్టములనుగూర్చి యాతనికి జెప్పగా యా మునిపుంగవుడు అమ్మా ! నీవెంతమాత్రమును జడువకుము నీభర్త నిన్నుబరీక్షించుటకై యిట్లుచేసినాడు కాని వేరొండుకాదు. ధైర్యమును వీడక మగని నెంతమాత్రమును మఱువక యుండుమని జెప్పి మోక్షమార్గమునకుంగల త్రోవలుజెప్పి ఋషికన్యలచే నామె కుపచారంబుల జేయించుచు తన యాశ్రమంబుననే యుంచుకొనెను.

ఇక మనము మగధలో చిత్రకరుం డేమిచేయు . చున్నాడో జూతము. ఆతడు తనతల్లిదండ్రులకు తానుభూమి నెట్లుజుట్టివచ్చినాడో

యచ్చటచ్చటగల విశేషము లెట్లుండెనో దెల్పుచుండెను. ప్రభావతిని వివాహమాడి యిట్లడవిని విడిచి వచ్చితినన్న సంగతిని గూడవిని యాతనితల్లిదండ్రు లాతని మిగుల దూషించుచునట్టి పరమసాధ్విని సుగుణభూషణిని విడిచినందునవచ్చు లోకనిందను మనమెటుల బాపుకొనగలము? అని దుఃఖములో మునిగి యుండిరి. చిత్రకరుండును తానుజేసిన పొరపాటు కార్యమునకై మిగుల వగచుచు మతిలేనివాని చందంబున దిరుగుచుండెను.

తిరిగి ఋషికుటీరముననున్న ప్రభావతివద్దికి చదువరు లిప్పుడు రావలసియున్నది. ప్రభావతి మునీంద్రునిచే మహాతత్వజ్ఞానమును బొంది తనయాభరణముల నెల్ల నొలిచి నొకవలువను మూటగట్టి తాపసోత్తమా! నేను మగధకు బోవలసి యున్నది. మీరిన్నినాళ్ళు నన్ను జనకునివలె గాపాడి జ్ఞానమార్గమును బోధించితారు. నేనీనగలతో బోయినచో ముప్పు వాటిల్లవచ్చును. ఆహా! ధనమెంత పనిచేయుచున్నది. పోటుబంటులనుపిరికిబంటులనుగా జేయించుచున్నది. అన్న దమ్ము లొకరినొకరు నరికించుచున్నది. తల్లిదండ్రులను బారదోలించుచున్నది. తప్పుడుసాక్ష్యము లిప్పించుచున్నది. సత్యమును నసత్యముగాను, అసత్యమును సత్యముగాను జేయించుచున్నది. నందిని పందినిగాను పందిని నందినిగాను జేయించుటా ధన పిశాచమే. యదార్థవాదిని లోకవిరోధిగాను దుర్మార్గుని యదార్థవాదిగాను జేయించుమాత్ర మెవరు? గావున నోమునివరా! నావద్ద నీనగలుండినచో చోరులు నాప్రాణమును దీయుట కెంతమాత్రమును సందేహింపరు? అందుచే దీనిని మీవద్ద భద్రపరచుడన, యామునిపుంగవుడో కమలనేత్రీ! నీవుచెప్పిన వెల్లయు యదార్థమే గావుననట్టి యాభరణములు మా యాశ్రమములోనున్న మాయునికి పట్టులకును మాకునుగూడ ముప్పు వాటిల్లునుగాన నీరక్షణార్థమై నేనొక్క మంత్రంబు లుపదేశించెద

వాటిని బరించుచుబోయిన నీకెట్టిభయమును గలుగదని దీవించి యామెను తనయాశ్రమమునుంచి సాగనంపెను.

ప్రభావతియు ఋషి శ్రేష్ఠునిచే దీవనలంది తనగుఱ్ఱంబుపై నెక్కి క్షేమంబుగ మగధకుంబోయి యూరివెలుపలదిగి తనవస్త్రాభరణములను తిరిగి ధరించుకొని నాయూరివారల నడిగి యారాజ్యము ప్రస్తుతము శత్రురాజుల చేతనున్నదనియు చిత్రకరుండు మతిలేక పిచ్చివాడై తిరుగుచున్నట్లును దెలిసికొని, తత్క్షణమే పతిని స్మరించుచు, పంచాక్షరీమంత్రమును జపించెను. అవ్విధమున నొక్కసారి పంచాక్షరి పఠించగానే తేరు హస్తి హయకాల్బలములును, శూలఖడ్గకోదండాది శీరాయుధంబులును, సృష్టింపబడెను. అవన్నియుగని శత్రురాజు, తనకంటె బలముగలవాడెవ్వడో తనపైదండెత్తి వచ్చుచున్నాడని గడగడ వణకుచు భార్యాపుత్రమిత్రకళత్రాదులతో పారిపోయెను.

అటువెనుక ప్రభావతిపురములోనికి బోయి తనయత్తగారుండు సౌధమునకుబోయి నమస్కరించి యావద్వృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు వినిపింపగా యామె ప్రభావతిందనయొడిలో గూర్చుండబెట్టుకొని ముద్దిడి, అమ్మా! నీవు మావంశమునకు యశస్సును దెచ్చెడిదానవు. మహాపతివ్రతవు నీకేమియు భయములేదని యామెనూరడించి తాము పరరాజులచేరాజ్యమోడిపోయి పలుబాములుపడు సంగతులన్నియును జెప్పి చిత్రకరుడు తానుజేసిన తెలివితక్కువపనికి తన్నుతానేదూరుచు పిచ్చిపట్టిన వాడై తిరుగుటయు జెప్పెను. ఈమాటలువిని యాతడెందున్నాడనియడిగి తెలుసుకొని తత్క్షణమేపోయి వానినిబట్టి తనగుర్రంబుపై గూర్చుండబెట్టుకొని తీసుకొనివచ్చి తన మహాపతివ్రత మహిమవలన నాని బిచ్చినిబోగొట్టి నెప్పటియట్ల జ్ఞానవంతునిగజేసి తల్లిదండ్రులచే సతనికి బట్టముగట్టించి షోడశోపచారముల నతని సంతోషపెట్టుచు ముల్లోకములనిట్టి గొప్ప పతివ్రతలేదనికీర్తిబడసి పెక్కు సంవత్సరము

లష్టయిశ్వర్యములతో దులదూగి తుదకు భర్తసహగమనము గావించి కైవల్యపదవి నందెను.

కావున పాఠకులందరిట్టిపతివ్రతల చరిత్రలను జాగ్రత్తగాజదివి వారి ప్రభావములను గ్రహించి భర్తలనింతులెట్లు బూజించుచున్నారో గనిపెట్టి తామావిధమున జేయుటకు బ్రయత్నించి ప్రభావతివలె యిహపరలోకసౌఖ్యముల ననుభవించెదరుగాక.

ప్రభావతీదేవి చరిత్రము అంతము.



# 16. జయప్రదాదేవిచరిత్రము.

పూర్వము విశాలనగరమును పరిపాలించుచుండిన సోమదత్త మహారాజు పంకజవల్లియను నుత్తమపత్నిని వివాహంబు జేసికొనెను. అప్పరమ పతివ్రతయగు పంకజవల్లి భర్తననురాగముతో బూజించుచు భర్తయేదైవమని నమ్మి నిరంతరము భర్తపదార విందధ్యానముగా వింపుచు నిశ్చలభక్తి గలిగియుండెను. ఆసోమదత్త మహారాజట్టి సుగుణ మణిని గలిగి యుండియుగూడ సంతానలేమింజేసి మిగులచింతాక్రాంతుడై యుండి భార్యందోడ్కొని, కానలకేగి మునులవద్దనుండి, వారికి సుశ్రూషలు జేయుచుండిరి. అంతటయామునులా దంపతులసుశ్రూషలకు మిగుల సంతసించి పుత్రకామేష్టి యాగము జేసి అందుండివచ్చిన అవిర్భాగం బనుపాయసము నా పంకజవల్లికొసగి రాజునుగాంచి ఓ రాజా! నీకు కొలదికాలములో కోరినసంతానముగల్గును పొమ్ము అనగావిని యాదంపతులు మునిపుంగవులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి వారిచే సెలవంది తమపురంబునకుజని యెప్పటియట్లరాజ్య మేలుచు సుఖంబున నుండిరి.

అంతగొన్నాళ్ళకా పంకజవల్లి గర్భిణియైయిద్దర కవలబిడ్డలను గనెను. రాజీసంగతి విని యపరిమితానందకందళితహృదయారవిందుడై పుణ్యాహవచనములు జేయించి భూసురులనురప్పించి యొకశుభము హూర్తమునవారికిగోదానభూదాన సువర్ణదానఅన్నదానము మొదలగు దానములు గావించి జాతక నిర్మాణములు జేయుచుండగా, వెనుక తానాశ్రయించిన మునులచ్చోటికి వచ్చిరి. అంతరాజువారిని యర్ఘ్య పాద్యాదుల బూజించి యుచితాసనంబుల గూర్చుండబెట్టి సాష్టాంగ దండప్రణామములాచరించగా వారాదంపతుల నాశీర్వదించి రాజా! నీపుత్రులనిరువుర నొక బంగారు పళ్ళెంబుతో నుంచి తీసుకొని రమ్మని

యాజ్ఞాపింపగా నాతడెంతయు వినయ భయ భక్తులతో స్వయముగా నాబిడ్డలగొనివచ్చి మునులముందిడిన 'వారందలి మగశిశువును గాంచి ఓ సుమతీంద్రా! సుమతీంద్రా! యని ముమ్మారుబిలిచి నామకరణ మొనర్చిరి. తదనంతరం బాడుబిడ్డను గాంచి ఓజయప్రదాదేవి! యని ముమ్మారు బిలిచి పేరు పెట్టిరి. వారంత రాజును హెచ్చరించి యాతని నాశీర్వదించి, సెలవొంది తమనిజవాసంబులకు జనిరి.

అప్పటి నుండియు సోమదత్తుడు తన బిడ్డలను శుక్లపక్షహిమాకరుని వలెవృద్ధిం బొందించుచు, మిగుల గారాబమున బెంచుచు, విద్యలు నేర్పించుచు, ధర్మమార్గ విషయము లనుదెల్పుచు, జాగ్రత్తగా బెంచుచుండెను. అంత జయప్రదా దేవి యౌవన వయస్కురాలుకాగా నామె తండ్రి యొక కన్యకామందిరంబు నిర్ణయించి యందు దాసదాసీజనంబులతో దన పుత్రికను భద్రముగ నుంచెను. ఇట్టుండ నొక్కనాడా జయప్రదాదేవి తన పరిచారికలతో విచ్చలవిడిగా నాట్లాడు కొనుచు సఖీ జనంబులతో పండువెన్నెల గూర్చుండి యుండగా, సుత్రామవల్లి యను యొక చెలికత్తె యామెంగాంచి అమ్మా! జయప్రదా, యీయేబది యారుదేశముల రాజులలోను ప్రతిష్టానపురము నేలు పురూరవ చక్రవర్తికి గల యోగ్యత మరి యెవ్వరియందును గానరాదు. ఎందుచేతనన నాతడు రూపమున మన్మథునివంటి వాడు. బలమున హిమవంతునికి దీసిపోడు. రూపమున సూర్యభగవాను డీతనికి లొక్కు. కుబేరు డీతని యైశ్వర్యము నందు సరిపోలగలడా? ధీరమున మేరువెందుకు? శాంతములో సముద్రుడు జెందులకు బనికి వచ్చును? అని యాతని ధైర్య శౌర్య సాహస గుణాదులను వివరింపగా విని, జయప్రద అతసని మోహించి శరీరము పులకరింప యాతని దక్క వేరొక్కని వివాహము జేసి కొననని మనంబున నిశ్చయించు కొనెను. మరియు తన కాతడే

పతి గావలెనని దైవమును ప్రార్థించుచు అహోరాత్రములు మన్మథావస్థచే శరీరము శుష్కించుచుండ కాలము గడుపుచుండెను.

ఇట్లు చిక్కి హీనస్వరముతో మాటలాడుచు మోము వాడియున్న జయప్రదను గని యొక చెలియ ఎన్నియో విధముల బ్రతిమాలియు యామె మనంబునగల దానిని దెలియ నేరక వెంటనే యాకన్యకామణి తల్లిదండ్రుల కీవృత్తాంతంబు నివేదించెను. తల్లిదండ్రులగుండె చెదరి పోగా వెంటనే యక్కన్నియ యుండు మఠంబున కుంజని ముద్దుల పట్టీ! ఇట్లురమ్మని పిలిచి శుష్కించియున్న కుమార్తెనుగాంచి విరహ వేదనచే నిట్లున్నది గదా యని గుఱితించిరి.

అంత నారాజు సభాస్థానము జేరి మంత్రి ప్రధానాదులను గని వేంటనే యాబది యారు దేశములరాజులు వచ్చునట్లు స్వయంవరము ప్రకటించు మనెను. అంతనా మంత్రి పుంగవుం డొక శుభదిన మేర్పరచి "విశాల నగర భూమీశుని పుత్రిక యగు జయప్రద తానువరించిన వారికి పూలహారము మెడ నుంచి వివాహము చేసికొన దలచియున్నది గావున మహారాజులను, రాజాధిరాజులు, నగు తమరందరు బంధుమిత్ర సకుటుంబ సపరివారముగా విజయము చేయ వలసినదని ప్రార్థన పూర్వకము పత్రికల నచ్చొత్తించి యందు సోమదత్తుని చెవ్రాలును బెట్టించి యావదేశములకు బంప యేబదియారు దేశముల రాజేంద్రులును తమకుంగల బంధుమిత్రులతోను రథగజతురగపదాతులతోడను వచ్చి పురము చుట్టును విడిసి యుండిరి అట్లేపుష్పహారవుండును తన పరివారములో నొక చోట దిగియుండెను. మరునాడుదయమున రాజులందరు స్నానసంధ్యా నుష్ఠాన జపతపహోమాది క్రియలు నిర్వర్తించుకొని సుగంధ పరిమళ ద్రవ్యముల నొడలనిండ నలది కొని స్వయంవర మండపమునకు విచ్చేసిరి.

అటుపిమ్మట సోమదత్త మహారాజు తన కుమార్తెను చెలికత్తెలనంపి రప్పించి స్వయంవర మండపమున నిలిపి అమ్మా! యేబదియా

రు దేశముల రాజులను రప్పించి యుంటిని అందు నీయిష్టంబగు వారిని వరించి నాభారమును దగ్గింపుమన, జయప్రదాదేవికి సోదరుడగు సుమ తీందుౖడు లేచి, రాజులనందరిని వీక్షించి, ఓ రాజశ్రేష్టులారా! నేను మిమ్మిప్పు డొక ప్రశ్న వేసెదను అట్టి ప్రశ్నకు దగిన సమాధానమే రా జోత్తము డిచ్చునో యాతనికి నాసహోదరి యగు జయప్రదాదేవి నిచ్చి కళ్యాణ మొనర్చెద ననెను. ఆప్రశ్న యెద్దియన, యీభూలో కంబున మిగుల శ్రేష్ఠత్వమును బొందియు గూడ ఖ్యాతినొందిన తల్లి దండ్రుల మహాత్మ్యమున స్త్రీ, పురుషునిగాను పురుషుడు స్త్రీగాను జ న్మించిన భేధమును మనంబున నిడక వంశవృద్ధి జేసి, గొప్పఖ్యాతియు స ద్గుణములను వహించిన నాపురుషుడే స్త్రీయై నుద్భవించి, క్రమముగా బెరగి, సకలధర్మాచార పరాయణుడును, సకలవిద్యా విశారదుండును, మహాపరాక్రమశాలియు, సకల దిగ్విజయ శాలియునై యెట్టి మహారా జు తపంబు జేసి సకల రాజులకున్న రాజ్యాధిపతియై మహావీరులకు వీరుండై యున్నాడో అట్టి చక్రవర్తికి నాసహోదరి నిచ్చెదనన, రాజులంద రు మూగవాండ్ర చందంబున తలలుపైకెత్తి యును గోళ్లగేలవ్రా యుచు మాటలాడక గూర్చుండి యుండిరి. అంతపురూరవ చక్రవర్తి ధైర్యముతో లేచి సభవారందరిని జూచి తన వంశము యొక్క పూర్వ వృత్తాంతము నంతను. నీతియును గౌరవములను, వసిష్ఠాదిగురువుల యను గ్రహమును, దైవకృపాతిశయములను, తన జననీ జనకుల పారంపర్య యు, తన యుద్దేశ్యములను వినిపించెను. అప్పుడు జయప్రదాదేవి తన కరంబుననున్న పూలహారము నెత్తికొని పురూరవుని కంఠంబున నిడగా నంతరిక్షమున నిందాలది దేవతలు పూలవర్షములు గురిపించిరి. అంత భేరీమృదంగాది వాయిద్యములుమ్రోయ, రంభాది వేశ్యలు నాట్య మాడ, కింపురుషులాది గాగలవారు పాడ, గాంధర్వాదులకైవారము లు చెప్ప, నారదాదిమును లాశీర్వదింప, దేవతులొక్కటే మాటగా

పురూరవుడే జయప్రదకు దగిన భర్త, యని నుడువ మహావైభవము తో కళ్యాణ మైనది.

అప్పటినుండియు జయప్రదాదేవి తనభర్తకు షోడశోపచారములు జేయుచు దైవముగా దలంచుచు భక్తివినయముల బూజించుచు, అత్తమామల పాదములొత్తుచు, వారిమాటకెదురాడక యదే కైలాసముగ నెంచుచు, భర్తనామమే తిరుమంత్రమువలె పఠించుచు, సర్వకాలసర్వావస్థలయందు భయభక్తి వినయాదిసద్గుణములతో బ్రొద్దుగడుపుచుండెను.

ఇట్లుండ పురూరవుడు శనైశ్వరుని మాయప్రభావంబున తన పట్టణమును వస్తువాహనపరివారములను విడచి, దారాసుతాదులతో నర్ధరాత్రమున కాననముప్రవేశించి రేయియంతయు నడచినడచి యినుడుదయించుసరికొక కొలనువద్ద నించుక విశ్రమించియుండిరి. తరువాత నాకొలనులో స్నానమాచరించి దైవపూజలను దీర్చుకొని పురూరవుడు భార్య బిడ్డలకష్టములు జూడనేరక హాదైవమా! మమ్మెంత కష్టపెట్టుచుంటివని పంచాక్షరమంత్రమును జపించి, చింతాక్రాంత చిత్తుడై తనభార్యనొక బిడ్డ తానొకబిడ్డ నెత్తుకొని అందందుగల సృష్టివైచిత్ర్యములను తనభార్యకు జూపుచు నామెనుత్సాహపరచుచు ప్రయాణము సాగించుచుండెను.

మార్గమాధ్యమునవారు గొన్నిపంటభూములను గాంచి అందు ధాన్యము నూర్చుచుండుట గూడజూచి పురూరవుడు జయప్రదం గాంచి, యిది మనము నివసించుటకు తగిన ప్రదేశమని జెప్పెను చాలయెండ యెక్కినందున యెండవేడిమికి తాళలేక తెల్లవారిన వరకు నడచిన కష్టమువలనను నోటమాట రానందున నాలుక దడి యారుటవలనను యాదంపతు లిరువురు మూర్ఛ జెందిరి. అంత వారి బిడ్డలు ఇద్దరున్ను ఘోలుమని యేడువసాగిరి. యీయేడ్పువిని యా

మార్గముప్రక్క బోవుచున్న వారికో తగాండ్రు విని యిది యేమి ? యెవ్వరిది ? యోపసిబిడ్డల కంఠధ్వని వినవచ్చుచున్నది. చూచివచ్చిన బాగుండునని ఆనందుడనువాడు జెప్పెను. వారిలో నొకడు శీఘ్రము నపోయి యాబిడ్డలను వీక్షించి ఆకలి దప్పులచేతను నడకశ్రమము చేతను మూర్ఛిల్లినట్లు దెలిసికొని వెంటనేవచ్చి తనమేస్త్రియగు ఆనందుని కాసంగతి విన్నవించెను. అంత ఆనందుడు మొదలగువారు, వారికి వారి భార్యలుదెచ్చిన యన్నములో గొంత, యానూతన మార్గస్థులకిచ్చి, వారిని సేదదేర్చి మీరెవ్వరని వారినడిగిరి.

ఆనందునిజూచి పురూరవుడు పెడమొగము పెట్టుకొని గద్గద స్వరముతో నిట్లని చెప్పగడంగెను. నేను పురూరచక్రవర్తి కొలువున లెక్కలువ్రాయు గణికుండను. ఆరాజు రాజ్యసర్వస్వమును జూదమున నందోడి యెచ్చటికోబోవ, నేను నాపొట్ట జేతబట్టుకొని భార్యబిడ్డలను గూడదీసికొని యెందైన జీవించవలయునని వచ్చితిని. నాకెచ్చోట పని సేయుటకు భగవంతుడు నిర్ణయించి యున్నాడో తెలియదని విచార ముతో జెప్పగా విని ఆనందుడు మిగుల సంతసించి అయ్యా మేమంద రమును కూలి వాండ్రము. మాకు ఉన్నదానిలో తమకు కొంచె మిచ్చెదము గావున మాకును నట్లే లెక్కలువ్రాసి మావద్దనే బ్రతికియుండుడన రాజందుల కంగీకరించెను. అంత వారందరా జయ ప్రద కొకచీరను పురూరవుని కొక పంచను గొనివచ్చి వారికిచ్చి తమ యిండ్లవద్ద నొకగుడిశెను వేయించి యాదంపతులు తమబిడ్డలతో నచ్చోట గాపురముండునట్లు జేసిరి. ఆనందుడు మొదలగు వారిట్లు దమయందు ప్రేమగా నుండుటనుగని యిది యంతయు భగవంతుని చర్యయేగాని వేరుకాదని తనభార్యకు బోధించుచు, ధర్మార్థ కామ మోక్షమును గూర్చియు జ్ఞానవైరాగ్యములను గూర్చియు నామెకు బోధించుచుండెను. మిగుల పతివ్రతయగు జయప్రదయు, తానుకష్ట

ములలో నున్నను వాటిని సరకుగొనక, పతియే దైవమని యెంచి తన విపత్తులు మాన్పుడని ధ్యానము సేయుచు పతియన్న మిక్కిలి భయ మొందుచు మునుపటికంటె నెక్కువ యుపచారములు శేయుచు సత్య ములనే పాటించుచు పతిపాదము లొత్తుచు బిడ్డలను గాపాడుచు మగనినిగాంచి సంతోషించుచు నతిప్రియముతో నడచుచుండెను.

ఇప్పుడు పురూరవుండును జయప్రదయును నాతని బిడ్డలును నివసించు చున్నది సోమపురియను పట్టణము. ఆపట్టణమున నవకోటి నారాయణశెట్టి యను నొకగొప్ప కోమటి గలడు. ఆతడు మిగుల ధనికుడు. ఆతని యైశ్వర్యలక్ష్మి క్రమముగా తగ్గిపోవుట గ్రహించి యాతడు బ్రాహ్మణులను పిలిపించి కారణమడుగ, వారతనికి దేవాల యముల గట్టింపుమనియు, సత్రములు చావళ్ళు నిర్మించుమనియు, తటాకములను బావులనుద్రవ్వించినచో నైశ్వర్యము హెచ్చునని యుజెప్ప, యాశెట్టి యందుల కియ్యకొని మొదట తటాకమొండు ద్రవ్వింప సమకట్టి కూలివాండ్రకు మొనగాడైన ఆనందుడను వానిని బిలిపించి వానికి చెఱువును ద్రవ్వించు నట్లుత్తరు విచ్చెను. ఆనందుడు మొదలగు కూలీలందఱును యాకొలను ద్రవ్వను నేరోజునవచ్చు కూలి నాడినమే పుచ్చుకొనుచుండి ఆనందుడు తాము గణకుడుగా నున్నందున నాతనికి గూడ యాశెట్టిచేతనే గొంత భత్య మిప్పించు చుండిరి.

ఇట్లు గొంతకాలము జరుగుచుండ నప్పటి కా శెట్టి కేమిపుట్టెనో కూలీల నందఱిని బిలిచి నేటినుండియును మీకూలికొఱకు మీ రేరా నక్కరలేదు. మీమీ భార్యలను బంపుచుండుడని గట్టడిచేయ వారును నట్లేవచ్చి కూలిసొమ్మును దీసికొనిపోవుచుండ నొకనాడా నారాయణ శెట్టి శని ప్రభావముచే బుద్ధిమఱలించుకొని కూలివాండ్రతో గణకుని భార్య యేదని యడుగ, యాకూలీలు గణికుని భార్యను జూపిరి. ఆత

డామెనుజూచి మహాపతి వ్రతాశిరోమణి యని యెఱుంగలేక తల్లి యని దలంపక "పరస్త్రీ నెట్టిపురుషుడైన మాతృభావమున జూడ వలెన" న్న పెద్దల పలుకు మన్నుగలిపి, ఆహా! యీమె ఎంత సౌందర్యముగా నున్నది. ఈమె మోము శశాంకుని ధిక్కరించుచు న్నది. ముక్కు తిలపు పుష్పమును బోలియున్నది. నేత్రములు లక్ష్మీ గృహమును మించియున్నది. కురులు తుమ్మెదల బారును బోలియున్న వని, నఖశిఖపర్యంత మామెను వర్ణించుచు నామెను మోహించెను. ఆమె నేలాగున వశపరచుకొనవలెనని యోచించుచుండ నొకనాడు కూలీల భార్యలందరు వచ్చిరి. గణికుని భార్య యేల రాలేదని వారి నడుగ వారుమాకు దెలియదనిచెప్పి తమకూలిని బుచ్చుకొని తమ దారినిబోవుచు దారిలో గనుపించిన జయప్రదనుజూచి అమ్మా మేమందఱముబోయి మాకూలిని దెచ్చుకొన్నాము నీవేలరాలేదని శెట్టిగారడిగినారనిచెప్పి తమ దారింబోయిరి. అంతభర్త యాజ్ఞచే జయప్రద తనకూలికై యావైశ్యుని యింటికిబోయెను. ఈలోపల యాశెట్టి తననౌకరునొకనిని బిలిచి గణికునిభార్య యిప్పుడు కూలికై వచ్చును. రాగానే యామె కూలి లోపలసావిట్లో డస్కుపెట్టెమీద నున్నది; వెళ్ళితీసుకొని పొమ్మనిచెప్పి యామె రెండవ దరవాజా దాటినతోడనే యాతలుపులను మూసివేయుమని రహస్యముగా గట్టడి చేసియుంచెను.

అంత నామె రాగానే నపుకరు అట్లేబలికెను. అందుల కామె కొంతసేపు మిగుల విచారించ నన్నుపోషించు తండ్రీ, పుణ్య పురుషా, నాభర్తయము నీవలనుంచిపోక లోపల నేలబెట్టిపోతివి యని కొంత సేపాలోచించి లోపలికిబోయిన భర్తయేమనునో పోక పోయిన నాకలికి పిల్లలోర్వజాలరు, యేమిసేయుదు దైవమాయని యెట్టకేలకు ధైర్యము వహించి రెండవసావిడలోనికి బోయి యాశెట్టి

గారు తనభత్యము నెచ్చట బెట్టినారోయని యిటునటు చూచుచుండ శెట్టిగారు జెప్పినట్లు భృత్యుడుబోయి తటాలున నాగమ్మపు తలుపులను మూసిరి. తలుపుల శబ్దము నామెచెవిని బడినతోడనే, నామె గుండెలదర, శరీరము కంపమొంద, సగము ప్రాణముపోవ, హానాధా ! నాకెట్టి యిక్కట్లు వచ్చెను ? నీవద్దనున్నందున నాకీ యరణ్యవాసమున నరవాసమువలెనే యున్నది. నాకంత కష్టమనిపించలేదుగాని యిప్పుడిట్టి యిక్కట్టులు వచ్చెను. నీవువచ్చి నన్నుగాపాడనిచో నా కెవరు దిక్కు ? యని భర్తనే ప్రార్థించుచ్చూనుచు నాగదిలో నెవ్వరు లేకుండుటగని యందొక మూలనున్న పెద్దపెట్టెనుజూచి యది తెఱవబడి యున్నందులకును కాళీగావున్నందులకును మిగుల సంతసించి ఆహా నన్నులోపలకు బొమ్మని తలుపులను బిగించిరి. యిది యంతయు నాపూర్వజన్మ ప్రారబ్ధకర్మఫలమును, శనైశ్వరుని మహిమయునై యున్నది. కానిమ్ము. మాదంపతు లిరువురును గలిసియుండుట భగవంతుని కిష్టములేనట్లు గాన్పించుచున్నది.

అనియాపెట్టెలోదిగియందుగూర్చుండి, ఓదైవమా! నీవునన్నెన్ని విధములకష్టపెట్టిన నోర్చుకొందునుగాని, నాపతివ్రతభంగము గాకుండ పతివ్రతామాహాత్మ్యము బోకుండ రక్షించుము, మఱియు నేనీకట్టె యందున్నంతకాల మిది అగ్నిహోత్రముచే గాలరాదు ; నీటిచే దడువరాదు ; ఆయుధములచే బగులబడగూడదు ; ఎప్పటికిని సిథిలము గారాదు ; నేనిందున్నకాలము నాకాకలి దప్పులుడుగవలెను. మరియు నాభర్తవచ్చి దానిపై చేయి నిడువరకిది తెరువబడరాదు. నేనేగనుక మహాపతివ్రత నగుదునేని యీవాక్యములన్నియు జరిగితీరుగాక యని పెట్టెమూత బిగించుకొని యందుండెను. అంత సరస్వతీ దేవివచ్చి నామెపలుకులకు మిగుల భయపడి జీవామృతమంత్రము నాపెట్టెపైబ్రయోగించి మూతబిగించి ఈమె పతిచేత దక్క నీపెట్టె మొరులచే దెఱువబడరాదని జెప్పి చనెను.

అంత గొంతసేపటికి నవకోటినారాయణశెట్టిగారు వచ్చి తన భృత్యులను మెచ్చి తలుపులను దీయించి లోనప్రవేశించి గదియంతయు వెదకి గానక ఆశ్చర్యమొంది తన నౌకరులను జూచి పెట్టెను దెఱచి చూడుడుబకవేళ అందులో నుండునేమో యన వారా పెట్టెను దెఱవజూచిరిగాని యది వారికసాధ్యమయ్యెను. అంత శెట్టిగారును వారిసేవకులును గలిసి తెఱచియున్న యీపెట్టె మూయబడి యుండుట కేమికారణము; యీమె తప్పక యిందులోనే యున్నదని నిశ్చయించి యనేకవిధముల దెఱవనుద్యుక్తులైరి. గాని వారిప్రయత్నమంతయు బూడిదఁబోసిన పన్నీటివలెను అడవినిగాచిన వెన్నెలవలెను వ్యర్థమైనది. అందువలన యాశెట్టి మిగుల కోపించి యాపెట్టెను గొడ్డండ్రచే బగులగొట్టించుటకు త్తరువిచ్చెను. నౌకరులాపెట్టెను బగులగొట్టుట కెంతయు శ్రమపడిరికాని యది ఆవంతయు బగులక చెక్కుచెదరకుండెను.

అంత శెట్టిగారిమనస్సున దిగులుపుట్ట కూలివాండ్రకు గణికుడగు నీమెభర్త వచ్చి యడిగిన నేనేమి చెప్పగలనని భయపడుచుండెను. తరువాత నాపెట్టెను బైటకుదెప్పించి జూడ గొడ్డలిగాయమొక్కటియు లేనందున మిగుల భీతిల్లి యిదేమి? మిగుల చిత్రముగ నున్నది. ఈపెట్టెను మీరాగదిలో నుంచియే తగులబెట్టుడని భృత్యుల యాజ్ఞాపించెను. వారును నట్లే యాగదిలో నిప్పంటించిరి. అంత నారాయణశెట్టి యిల్లంతయు తగులబడి నేలమట్టమయ్యెనుగాని యాపెట్టె మునిపటికంటె మరింత దేదీప్యమాన్యమానమై యొప్పుచుండెను. సెట్టి కాళ్ళుచేతులు వణకుచుండ నోటతడిలేక మేనంతయు చెమ్మటలు బట్ట, కండ్లుమబ్బులు గ్రమ్మ మనసున దిగులుపుట్ట దేహమెమరచి చేతులు నలుపుకొనుచు యేమిచేయుదును దైవమా? ఈపెట్టెలో తప్పక యీమె యున్నది. ఈపూరిరాజగారికీ సంగతి దెలిసి

నచో నాకెట్టిశిక్షవిధించెదరో ? గావున యీపెట్టెను తీసుకొనిపోయి పెద్దరాయి యొకటి దీనికిగట్టి సముద్రములో రహస్యముగా పారవైచిన నెవ్వరికి దెలియదు. వెయ్యేండ్లు యోచించినను యింతకన్న యుపాయము తోచదని మనస్సున దృఢపరచుకొని అండమానుదీవులకు బోయెడి తన వర్తకపు టోడపై నాపెట్టెనుంచి తానును దానిపై గొంతదూరముపోయి యచ్చోట నడిసముద్రములో నీపెట్టెను ద్రోయుటకు ప్రయత్నించెను. ఈసంగతి యాపెట్టెలో నున్న జయప్రద గ్రహించి సముద్రములో ద్రోసివేయుటకు సిద్ధముగానున్న సమయమున యాశెట్టింగని ఓసెట్టిగారు మీరిటువంటి యాలోచనలు జేసిన నేమిఫలము ? ఈపెట్టెనిప్పుడు దెరచుట కెవ్వరివల్లను గాదు. దీనిని నీటవిడిచినను నీళ్ళలో మునుగదు, చిలికి పాడై పోదు. తడవదు. గావున నే నొకమాట జెప్పెదను వినుము నాకొక నియమముగలదు. ఆవ్రతము పూర్తియగుసరికి ఏడుసంవత్సరములన్నర పట్టును. తరువాత నీపెట్టె తనంతట తానే తెఱచుకొనును. అంతవఱకీ పెట్టెను నీయిష్టమువచ్చినచో నుంచి భద్రముగ గాపాడుమనగా యాశెట్టి యందుల కచ్చెరువొంది యిదియేమివింత ? ఏడున్నరసంవత్సరములన్నపానములులేక నీమె యిందెట్లుండగల దోతమాషా జూడవలెనని దలంచి యాపెట్టెను అండమానుదీవులకు గొనిపోయి యందొక దివ్యసౌధమును నిర్మించుకొని యీపెట్టెనందుంచి తానును తమషా జూచుటకై యచ్చోటనే గాలము గడపుచు యాపెట్టెను గనిపెట్టుకొని యుండెను.

ఆహా ! మనమా గణికుండగు పురూరవుని విడిచి చాలదినములైనది. ఇంతదనుక నాతడు నాతనిబిడ్డలెట్లున్నారో ? యని మన చదువరులాత్రత పడుచుందురు గావోలు నేనును అందులకే వేగిరపడుచున్నాను. శెట్టిగారింటికిబోయి కూలిని తీసుకురమ్మని తనభార్యకాజ్ఞా

పించిపంపించిన యాంగణికుడు తనభార్యయెప్పటికిని రాకుండుటగని తన బిడ్డల నిద్దరిఁ జెరియొక చంక నెత్తుకొని సెట్టిగారింటికి జేరి నాతని సేవకులనుగాంచి ఓరీ నాభార్యనుజూచితిరా యనియడుగ అయ్యా ! కూలికై నీభార్యరాగా కూలిలోపలనున్నదిపోయి తెచ్చుకొనుమని జెప్పితిమి. ఆమెయు నట్లేలోనికరిగినది అంతయింటికి నిప్పంటుకొని యిల్లుతగులబడిపోయెను. ఇంతకన్న మాకు దెలియదని వారుచెప్పగావిని మిగుల చింతాక్రాంతమనస్కుండై బిడ్డలగాంచికండ్లనీరు బెట్టుకొనియేమియు దోచకయాపట్టణమువిడిచి అడవులంబడి పోవుచుండ శనేశ్వరునిమాయచేనకాత్తుగా నాకస మంతయు మబ్బుగ్రమ్మి మెఱుములతోను ఉఱుములతోను, జోరునవర్షించి నేళ్ళును కోళ్ళును నేకమై పొంగి పారలిపోవుచుండెను. ఇట్టిసమయమున మనస్సునెమ్మదిలేక భార్యనుదలంచుచు, శిశువులను జూచి దుఃఖించుచు దైవమును ధ్యానించుచు వాంటరిగా బోవుచున్న యపురూరవునికి సెలయేరొకటి యడ్డువచ్చెను. అదిమిగుల లోతు గలది. అందువలన నీతని కీతవచ్చినను ప్రవాహవేగమునకు జడిసి యిద్దరి బిడ్డల నొక్కసారిగొని పోవుట మిగుల గష్టంబని తలంచి పుత్రులలో నొకని నాయొడ్డునగట్టి రెండవవానిని దీసికొని ఆవలి యొడ్డునకు యీదుకొని వెళ్ళి యారెండవ బాలుని నచ్చోట గొన్ని తీగలకు గట్టిపెట్టి తిరిగి రెండవ బాలకునిగొని వచ్చుటకై యీదుకొనిపోవుచుండ ప్రవాహవేగముమిక్కిలివేగమై యీతశక్యముగాక యాపురూరవుండానీటంబడి గొట్టుకొనిపోయెను.

ఆహా ! చదువరులారా కాంచితిరా కలి మహిమ. బంధువర్గమునుండి పురూరవ జయప్రదలను విడదీసియు, తిరిగి తల్లినుండి తండ్రి బిడ్డలను విడదీసియు యంతటితో తృప్తినొందని యాకలిపురుషుడు బిడ్డలనొకరి నుండి యొకరిని వేరుగాను తండ్రిని వేరుగాను గూడగావించెను. అట్లుపురూరవుండు ఆప్రవాహవేగమున బడి చాలదూరము

గొట్టుకొని పోవుసరికి ఒకగొల్లవాడాయడవిని గొఱ్ఱెలమేపుచు నీటిలో నుండి గొట్టుకొని పోవుచున్న యాపురూరవుని గాంచి తన. చేతనున్న పొడుగాటి గడ నందించి అన్నా! దీనిని బట్టుకొనుమని పైకిలాగెను. అంత పురూరవునికి చలిపోవులాగున మంటవేసి యాగొల్లవాండ్రు గొంత శుశ్రూష జేసి వానికి బొడివస్త్రములనిచ్చి తమయొద్ద గొఱ్ఱెల మేపుచుండుమని అన్నపానీయాదులనిచ్చి బోషించుచుండిరి.

మన మిప్పుడు తిరిగి బిడ్డ లేమైరో కనుగొన వలసి యున్నది. ఏటికిరుప్రక్కలను తాండ్రతీగలచే గట్ట బడియున్న బిడ్డలిరువురను నొక గొల్లది చూచి యొకపడవమీద దాటి యాబిడ్డలిరువుర కట్లువిప్పి యొద్దరినొక ప్రక్కకు దెచ్చి యొక చెట్టునీడను గూర్చుండ బెట్టికొని తన వద్దగల పెరుగుపాలను వారికి ద్రాపనిచ్చి తనకు సంతానలేమిం జేసి సూర్యచంద్రుల వలెనున్న నిరువురు బిడ్డల తన యదృష్ట ఫలమున తనకులభించినారనియు దలంచి తన భుజములమీద గూర్చుండ బెట్టుకొని గృహంబునకు గొనిపోయి యచ్చట వారిని నతిగారాబమున బెంచు చుండెను. ఈవిధమున సతీపతిపుత్రులు వెవ్వేరుస్థలములయందున్నను శనైశ్చరునికి తృప్తిగలిగినట్లు తోచదు ఏలనన గొఱ్ఱెలను గాచియచ్చట నొక్చోట బండుకొన్న పురూర చక్రవర్తి యొద్ద కొకనాడొక దొంగ సూర్యపుత్రమహిమచేనాదేవపురిపరిపాలకుండగు దేవరాజుభార్యధరించు జ్ఞానునగలపెట్టెనెత్తుకవచ్చి నాచక్రవర్తినిద్రించు సమయమున నాతని తలక్రిందనుంచిపారిపోయెను. అంతనాతలారువచ్చి యందందు వెదుకు చుండ గొల్లవానితలక్రింద నీబంగారు పెట్టెగనబడినది. అంతనాతలవరు లీతని గొని పోయి రెక్కలు విరిచి కట్టిరాజునకొప్పగించిరి. రాజాతని కాళ్ళు చేతులు నరుకుడని యాజ్ఞాపించగా నాతలవరుల ట్లేఖడించిరి. ఆబాధ కోర్వలేక అడవిలో బడి యేడ్చుచు దొర్లుచున్న పురూరవుని జూచి బ్రహ్మభార్యయగు సరస్వతీ దేవి మొండిగానుండి బాధపడుచున్న

యాపురూరవుని యాక్రంద ధ్వని విని యచ్చోటికి వచ్చి యాతను పురూరవుడనియు నాతనికిట్టివిపత్తు కలిమాయవలన గలిగిన దనియు గ్రహించి యాతనికి దగిన యుపచారములను చేసి గాయములను మాన్పుచు ఎప్పటికప్పుడు వచ్చి యాతని కమృతము నిచ్చిపోవుచుండెను.

అటుపిమ్మట దేశికశెట్టి యను ధనికు డీతని సంగతి దెలిసి తన గృహంబునకు దీసికొనిపోయి సతిగారాబముతో గాపాడు చుండెను. అంత నొకనాడు ఉపబుషియను మునిపుంగవు డచ్చోటికి విజయము చేసి యాపురూరవుని సమాచారము పరిపూర్ణముగా విని మిగుల విచారించి పురూరవుని గాంచి యిట్లు జెప్పెను. "ఇకముందు నీవు నీభార్యబిడ్డలను గలిసికొని సుఖంబున రాజ్యాభిషిక్తుడ వగుదువు గాక" యని ఆశీర్వదించి పురూరవుని బిడ్డలను పెంచుచున్న యా గొల్లదాని యింటికిబోయి తానచ్చోటనుండి విలువిద్య వారికి నేర్పించి, పిదప అండమాన్ ద్వీపమునకు బోయి అచ్చోటను పెట్టెను. గావలి గాచుచున్న నవకోటి నారాయణశెట్టిని గాంచి క్షేమంబరసి పురూరవునికిగల కష్టములనెల్ల యాతనికి జెప్పగా పెట్టెలో జీవించి యున్న జయప్రద యీమాటల నాలకించి మిగుల దిగులొంది పెట్టెలో తపించుచు దైవమా నేనిక యేమిసేయగలను? ఎట్లు జీవించ గలను? నాభర్త నెప్పుడు జూడగలను? అని దుఃఖించుచు ఆహా కాళ్ళుచేతులు పోయినను యిబ్బందిలేదు ప్రాణముంటే నంతేజాలునే నేను సంరక్షించు కొనగలుగుదునని మనస్సు దిటవుజేసికొని సమయ మెప్పుడు వచ్చునని నిరీక్షించు చుండెను. అంత నాముని పుంగవుడు శెట్టితో పురూరవుం డెప్పటియట్ల తనభార్యా బిడ్డలను గలిసికొని సుఖంబుండును. అనిచెప్పి తనదారిని బోయెను.

అంత గొన్నినాళ్ళకు పురూరవుడు దేవపురమున శెట్టి యింట నుండియే అర్ధరాత్రము నందొకనాడు పండువెన్నెలలో సౌధంబున

పరుండి సంతోష ముప్పతిల్ల వీణవాయించుచుండెను. ఆపాట నాపట్ట ణపురాకుమారియగు పుష్పపాంచాలి చెవిని బడినందున శ్రవణానంద ముగ విని యాతని మోహించి తనచెలికత్తెలను లేపి ఆపాడుచున్న పురుషుడెవరో యెచ్చటనున్నవాడో వేగిరము చూచిరండు నామనం బాతనిపై నున్నది. అతడెవరైనను సరే నేనాతని దక్క నొరులను బెండ్లియాడనని పలికి వారిని బంపెను.

వారు త్వరగాబోయి నలుదిక్కుల వెదకి శెట్టిగారింట నాతని జూచి తిరిగివచ్చి అమ్మా మనయింట ఆభరణముల పెట్టెనెత్తుకొని పోయిన యామొండివాడే పాడుచున్నాడని చెప్ప ఆతని కర్మవశంబున కాగతివచ్చెను. అయినను నాకాతడే భర్తగావలయును అని మదనో ద్రేకములోమునిగి అన్నపానీయంబులను ముట్టక శుష్కించుచుండ నీసమాచారమును గొనిపోయి చెలికత్తె లామె తల్లిదండ్రులకు నివే దించిరి. అంత నారాజు యావద్దేశముల రాజపుంగవులను రావించి తనకుమార్తెకు మంగళ స్నానంబులు గావించి సభకురప్పించి రాజుల నందరిని జూపించి పుష్పమాల నామెచేతికిచ్చి తనకు ప్రేమగలరాజు కంఠంబున నామాల నిడుమని జెప్ప ఆమెతండ్రితో నిట్లనెను. జనకా యనీరాజుల నిదివరకే యెఱుగుదును. వీఱందరు వెనుక నాతో గాన విద్యలో నోడినవారు గాదా ! వీరందరు నాకవసరము లేదు. నేను కోరియున్న గానవిద్యా విశారదుడే నాకు గావలెననియు అట్టిమహాను భావుం డెచ్చటనున్నను వానికంఠంబున నీపూమాల వైచి కళ్యాణ ము జేసికొందును. అనిచెప్పి అట్టివాడెచ్చటను గాన్పింపమి తనయిష్ట దైవమును దలంచి కరముననున్న పుష్పమాలిక గిరగిర ద్రిప్పిపై కెగుర వేసి ముకుళితహస్తయై తనకోరిక యీడేరవలయునని దైవమును ప్రార్థించుచుండ యామె మనోభీష్టప్రకారము సభయందొక మూల గాగూర్చుండియున్న పురూరవుని మెడయందు బడెను. అంత పుష్ప

పాంచాలి యాతడే తనభర్తయని వినయ తాత్పర్యములతో నమస్కరించి నిలుచుండగా తల్లిదండ్రు లామెను గాంచి చాలవిచారగ్రస్తులై మొంటివానికి తమముద్దుల కుమార్తె భార్యయైనందులకు మిగుల వగచుచుండ వసిష్ఠమహాఋషి వారి నూరడించెను. పుష్పపాంచాలియు తల్లిదండ్రులకు నమస్కరించి తాను ధరించియున్న వస్త్రంబులను యాభరణంబులను విడచి వారియెదుటనుంచి పాతచీర గట్టుకొని తనభర్తను ఎత్తికొని కాననములోనికి బోయి సరస్వతీదేవిని పూజించి ఆమెచే ఆశీర్వచనములంది పతిని దైవముగా దలంచి తగిన ఉపచారములు జేయుచు కాలము గడుపుచుండెను.

అంత సరస్వతీదేవికి మిగుల కరుణజనింప యామె నొకపట్టణము నిర్మించి అందు వీరిని సుఖంబుగ నివసించుడనిచెప్పి చనియెను. అటుపిమ్మట గొంతకాలమునకు శనైశ్వరునికి దయవచ్చి పురూరవుని యొక్కయు జయప్రద యొక్కయు సత్యశీలతాదులకును ధర్మమార్గ పరాయణంబునకును మెచ్చి వారినిక విముక్తుల జేయదలంచి నాతడు ను యీశ్వరుడును విష్ణువును గలిసివచ్చి యాచకస్త్రీని పలువిధముల నాశీర్వదించి పురూరవు నాపట్టణమునకు రాజుగా పట్టముగట్టి చనిరి. అంత నాచకస్త్రి కెప్పటియట్ల కాలుసేతులు వచ్చెను. పుష్పపాంచాలి కందులకు సంతోషము హెచ్చెను. అంత నామె తన తల్లిదండ్రుల రప్పించి తనభర్తను జూపించినవారును సంతోషముప్పతిల్ల దగ్గరనే యొకపట్టణము నిర్మింపజేసి దానికి దైవికపురమని పేరుబెట్టి పురూరవునికి దైవిక మహారాజని పేరుబెట్టి వారు తమ స్థానంబులకు జనిరి.

అంత నారాజు ధర్మశాస్త్ర ప్రకారము రాజ్యభారము చేయుచుండ తనవెనుకటి మంత్రిశేఖరుండగు మతిధీరుడు అనేక దేశములు తిరిగి యెందునుగానక ఇచ్చోటకివచ్చి రాజును గలసికొని తిరిగి యా

దేశమునకు మంత్రిగానుండెను. అంత గొల్లది పెంచుచున్న యిరువురు బాలురు పెద్దవారు కాగా యచ్చోటనైన తగిన యుద్యోగముల నిప్పించ వలెనని దైవీకపురపు రాజుగారివద్దకు గొనివచ్చి తనపుత్రులను నౌకరులనుగా నుంచుకొనుమని రాజును బ్రార్థించగా రాజు వారిద్దరికి తనకొలువులో యుద్యోగముల నిప్పించెను.

ఈసంగతి యిట్లుండ అండమాన్ ద్వీపములో నున్న నవకోటి నారాయణశెట్టి కేమియు దోచక తత్తరపడుచుండ దైవికపురము నందలి రాజు గుడ్డివాండ్రకును కుంటివాండ్రకును చెవిటివాండ్రకును తమకష్టములనుబాపి కోరినకోర్కెలిచ్చి పంపుచున్నాడని తెలియవచ్చి తన పెట్టె నాతనిచే దెఱపించదలచి యాపెట్టెను బట్టించుకొని తానా పురమువచ్చి చేరెను. అందు రాజుగారియెదుట నాపెట్టెనుంచి యం దుండు చిన్నది మిగుల సౌందర్యవతి యని చెప్పి యామెనుగూర్చి కొంతవరకు చెప్పెను. రాజదివిని యచ్చెరువొంది సరస్వతిదేవిని మనంబున స్మరించ వెంటనే యాదేవి ప్రత్యక్షమై రాజుతో ఓరాజా పతివ్రతయగు నీపత్ని జయప్రదాదేవి మానంబున కొడిగట్టి యాపెట్టెలో వ్రతము పట్టియున్నది. ఆమె తన ప్రతివ్రతా ధర్మంబున యితరులచే దెరువనీయక అగ్నికిని నీటికిని చెదలకులు గొడ్డండ్రకును జోటియ్యక శాపంబుబెట్టి పార్వతీశ్వరుని హస్తంబు బెట్టినచో దెఱువ బడవలెనని ప్రతినపట్టిన్నది గావున నాపెట్టెను నీచేతితో తాకిన నీభార్యంగాంతువని జెప్ప యాతాజట్లే గావించెను. అంత నాపెట్టె తటాలున దెఱవబడి నందుండి దేదీప్యమానమై వెలుగొందుచున్న జయప్రదాదేవి బయటికివచ్చి భర్తపాదములంబడి సాష్టాంగ దండ ప్రణామంబులాచరించినిలుచుండెను. అప్పుడుసరస్వతీదేవిరాజుంగాంచి, ఓసార్వభౌమా నీమొదటి భార్యయగు జయప్రద ఈమెయె నీవద్ద కొలువునకు గుదిరిన బాలులిరువురు నీపుత్రులే వారందరి జేర్చుకొను

మని ఆశీర్వాదంబులు పలికి యంతర్ధాన మయ్యెను. అంత నారాజు పూర్వమేలెడు పట్టణమునుండి యనేకమంది భృత్యులు సామంతులు వచ్చి శత్రురాజును దఱిమి వేసితిమి మీరికవచ్చి యెప్పటియట్ల రాజ్యము చేయుడురండన పురూరవుడు మిగుల సంతసముహొంది తనమొదటి భార్యయగు జయప్రదతోను రెండవసతియగు పుష్పపాంచాలితోను పుత్రులిరువురతోను మంత్రి సామంతాది బంధువర్గముతోను తన నిజ పురంబునకు జని సుఖంబుగ రాజ్యము సేయుచు సతీపతు లందరును విష్ణుసాయుజ్యమును జెందిరి. గావున పాఠకులారా చూచితిరా జయప్రదా దేవియొక్క కష్టములు ? శనేశ్వరు డెన్నికష్టములు పెట్టినను నమ్మహాపతివ్రతయగు జయప్రద యెట్లు ఓర్చుకొని పెట్టెయందు నిద్రాహారములు మాని సర్వకాల సర్వావస్థలయందును భర్తనే స్మరించుకొనుచు నుండుటవలనగదా యామెకంత ఖ్యాతియును మోక్షమును రాగల్గెను.

జయప్రదాదేవి చరిత్రము సంపూర్ణము.



# 17 సంధ్యావళీదేవిచరిత్రము.

——:○:0:○:——

పూర్వము మాళవదేశమును పరిపాలించుచున్న స్వదేశమహా రాజునకు సుగుణములకాకరంబగు మంగళవతి యను భార్యగలదు. అద్దంపతులకు సంధ్యావళియను నొక పుత్రిక గలదు. అట్టికుమారీ రత్నమును వారతి గార్రబమున పెంచుచుండిరి. ఆమెకు యుక్తవయస్సు రాగానే యామెతండ్రి యొక ప్రత్యేకసౌధమును నిర్మించి యందా మెను సఖీ జనంబులతో నుండనియమించి మిగుల జాగరూకుడై మెలగుచుండెను. ఆయూరివారలా సంధ్యావళిదేవిని గాంచి యామె, సరస్వతియో; లక్ష్మీదేవియో లేక పార్వతియో యై యుండవలెనని యామె సౌందర్యమునకు మిగుల మెచ్చికొనుచు యామె శాంతశమద మగుణములను మిగుల కొనియాడుచుండిరి. ఇట్లుండ నొక నాడామె జనకుడు తన మంత్రులను గాంచి మంత్రిశిఖామణులారా! మిగుల పుణ్యాత్ముడును, సాంగత్యకుండును, గురుభక్తాపరుండును ధర్మచార పరాయణుండునునై తల్లిదండ్రులయందు భక్తిగలిగి, దైవభక్తిగలిగి అతిథులనాదరించుట గలిగి, సకలవిద్యయందును ప్రవీణతగలిగి యున్నాడో అట్టిరాజపుత్రునికి నాకుమారీరత్నము నియ్యదలంచి యున్నాను. గావున నట్టి వాడెవడో నుడువుడన, ప్రధానమంత్రి లేచి రాజునకు నమస్కరించి, రాజా! యీభూమండలమున విదర్భ దేశాధిపతియగు నగరమహారాజునకు పుత్రుడైన రుక్మాంగ మీరు జెప్పిన గుణములనెల్లగలిగి తమ యుల్లమురంజిల్లజేయు వల్లభుడు. అట్టిరాజు తమ కల్లుడగునేని తమ రాజ్యమున కెట్టి యాపదలు వాటి ల్లవు; ద్రవ్యము కుప్పలుగా వచ్చిచేరునని చెప్పెను. మరియు అట్టి యాతడు తమ కుమార్తెకు తగిన వరుడుగావున నాతనిని తమ కల్లునిగా జేయుటకు తగు ప్రయత్నము లొనర్చుటకు సెలవిండని

రాజాజ్ఞపొంది చిత్రరేఖయను లేఖరినిరావించి రాకొమరితయగు సంధ్యావళియొక్క పటమును వ్రాయించి దానిని నౌకరులకిచ్చి దానిని గొనిపోయి విదర్భదేశాధీసునకు సమర్పించుమనెను. ఆభటు లాపటము నతివేగమున మిగుల భయవినయములతో గొనిపోయి రాజున కందిచ్చిరి. రాజా పటమును నవలోకించి అచ్చెరువొంది ఆహా యిట్టి రూపుగల స్త్రీ లీలోకమున గలరా యని సంశయించ భృత్యులనడిగి నిజము దెలిసికొని తన సుతుండగు రుక్మాంగదుని రప్పించి యా చాయాపటమును బాగుగ వీక్షించి రాయినలె నిలచిపోయి కొంతవడికి తెలివిగాంచి ఆహా పటమునందే యీామె యింత యందముగా నొప్పారుచున్నది గదా. ఇక విగ్రహమెట్లుండునో ఇంత రమ్యముగ నీమెను సృష్టించుటకై బ్రహ్మకెంత కాలముపట్టెనో. యీామెను నఖశిఖపర్యంతరము పలువిధముల వర్ణించుకొనుచు నాపటమును గొనిపోయి, అప్పటినుండియు దృష్టియంతయు నామెపైననే యుంచి నిద్రాహారములుమాని క్రమముగా శుష్కించుచుండెను. యీాసంగతి భటులచే దెలిసికొని యాతని తండ్రి యొక సుముహూర్తమున మాళవదేశమునకు జాబును లిఖించి వారి యుద్దేశ్యముల నెఱింగించగా మాళవదేశాధిపతియగు స్వదేశమహారాజు వెంటనే వివాహామునకు తరలి రండని నగరమహారాజునకు లేఖనంపెను.

వెనువెంటనే నగరమహారాజు సంగీతవాయిద్యములతోడను రథగజపదాతులతోడను, సపరివారముతోడను బయలుదేరి మాళవదేశముచేరి తన కుమారునికి సంధ్యావళినికి వివాహాము గావించుకొని యందు గొన్నినాళ్లుండి తదనంతరం బతని నిజపురంబున కరిగెను. అంత మిగుల పతివ్రతాతిలకమగు సంధ్యావళిని వివాహాము గావించుకొనిన రుక్మాంగదు డపరిమితానందహృదయుడై, మనునీతిమంతుండై పౌరులకు హితుండై సుఖంబనుభవించుచుండెను. సంధ్యావళియు పతిని దైవముగానెంచి, పతిపదారవిందముల డెందంబున నిల్పి అహర్నిశము

లతని బూజించుచు, హితములు బలుకుచు, భర్తకు పూజపాత్రలు, పుష్పలాయత్తపరచుచు నిత్యము మగనికి నత్తమామలకు పూజలొనర్చుచు భర్తకు హితమగు శాకపాకములు వండుచు యత్తమామలకు వలయు భక్ష్యములను మిగులలక్ష్యముతో సేయుచు అతిధి అభ్యాగతులకు పూజలొనర్చుచు భర్త భుజించినవెనుక శేషించిన దానిని తాను భుజించుచు, కాలము గడుపుచుండ గొంతకాలమున కత్తమామలు పరంపదించిరి. అంత విదర్భుకు తానే రాజై ధర్మమార్గపరాయణుండై ప్రజలయిష్టానుసారము రాజ్యమేలుచుండ సంధ్యావళి భర్తకిం కను యెక్కువగా నుపచారములు జేయుచు తన భర్త మరి తొంబది తొమ్మండ్రుకన్యలను వివాహమాడినందులకు మిగుల సంతోషించి పతినే దైవముగ పూజించుచుండెను.

ఇవ్విధమున సంధ్యావళి పూజించుచున్నను భర్తనూతనముగా వివాహము జేసికొన్న 99 యింతులయందుగల మోహాతిశయమువలన కామకేళిందేలుచు విచ్చలవిడిగావిహరించుచుండెను. అప్పుడామెమరింత భక్తిశ్రద్ధలతో భర్తను బూజించుచు పూజాపాత్రలు, పూజాగృహము శుభ్రము చేయుచు భర్త రాకకెదురు చూచుచు భర్తకిష్టాన్నములనుంచుచు శేషించినదానిని తాను భుజించుచు పతియే గతియని దలంచుచు నతిభక్తితో ప్రొద్దుపుచ్చుచుండెను.

అట్టిపరమ సాధ్వీమణియు మహాపతివ్రతా శిరోరత్నమును నగు సంధ్యావళినిగాంచి భర్త మిగుల సంతోషమంది భార్యనుజూచి నీయంతటిదానిని నేనెందును జూడను. రారమ్మని బుజ్జగించి యాదరించి తన 99 భార్యలకు భృత్యులచేనొకశృంగారవనము నిర్మింపజేసి అందు గులాబి, మల్లి, కాశీరత్నము, చేమంతి, పండుసంపెగలు' జాజి, సురపొన్న గొజ్జంగి. కేదంగి మొదలగు యనేక వృక్షములను నాటించి యందు ఘారావాండ్రను గావలిబెట్టి పూజకై వలయు పుష్పములను పత్రములను యీ 99 మంది భార్యలను దెచ్చి యిచ్చునట్లుత్తరువిడి తానెప్పటి

యట్ల మొదటిభార్యతో సుఖంబుననుండెను. ఆవనమునుజూచి మిగుల సంతసించి జాబాల మహర్షి అందున నొకమూల పర్ణశాలను గట్టికొని తపము జేసికొనుచుండెను.

అవ్విధమున మునితపస్సు చేయునట్టి యావనమున నొకదినమున అమరలోకవాసులగు అప్సరసలువచ్చి యావనమందలిపూవులుగొన్నితీసు కొనిపోయి ఈశ్వరారాధనకై యింద్రునికిచ్చి అప్పటినుండియు నదేవాడు కగానీవనము నుండియే పుష్పములను గొనిపోవుచుండిరి. అంతరాజస్త్రీలది తెలిసికొనలేక పుష్పములుమాత్రముదినదినము తగ్గుచున్నట్లు రుక్మాంగ దునికి విన్నవించగా నారాజు మిగులకోపము గలవాడై తనభృత్యు లను కావలివానులను రావించి ఓరీ సేవకులారా తోటలోని కుసు మంబులన్నియు నెవరో దొంగలు వచ్చికోసికొని పోవుచుండ మీరింత కండ్లుమూసికొనిపోయియున్నారా? మూడుదినములలో నాదొంగలను బట్టితేకుండిన మీరు తగినశిక్షకు పాత్రులగుదురు అనిచెప్పెను. నౌక రులది విని, మిగుల భీతచిత్తులై నిద్రాహారములు మాని తమ సామర్థ్య మంతయు నుపయోగపరచిదొంగలను బట్ట సమకట్టిరిగానివ్యర్థమయ్యె.

కాని యందొకమూల గూర్చుండి తపసు చేసికొను చున్న జాబాల మహర్షి నగాంచి యీతడే యాపుష్పములను తుద్భాధనడంచి కొన లేక భుజించుచున్నాడేమో, ఎందులకైనమంచిదని యాకావలి వాండ్రాఋషిపుంగవుని బట్టుకొని రాజు యెదుట నిలిపిరి. రాజాతని తగు విధముల సత్కరించి కుశలమడుగ ఋషియిట్లు వాక్రుచ్చెను. రాజ శేఖరా నీపురాకృత ఫలమున నీవనమందలి పుష్పలు గొందరప్సరలు వచ్చి దేవలోకమునకు గొనిపోవుచున్నారు. యిందుకై డందుల కెంతయు కొసియాడుచున్నాడన రాజుసంతసించి మునివరా నట్టియప్సరసలను నాకు జూపగలరా? యని యడుగ నందులకా తాపసోత్తముండు నీవ నమున యేటిపుచ్చవిత్తనములు చల్లితోటంతయు కలయద్రొక్కించినచో నీకు జూపగలనని ప్రత్యుత్తరమిచ్చి తనతావునకరిగెను.

తరువాత నాభూమీశు డట్లేయేటిపుచ్చ విత్తనంబులను వన మునందు మొలపించియెల్లడను బ్రాకింపగాదానిగాలితగిలినమాత్రాన యాదేవకన్యకలు పైకెగురలేక అచ్చటనే తపించుచుండిరి. అంత నమ్మహర్షి రుక్మాంగదునికి కబురు పంపి రప్పించి దివ్యజ్ఞానముచే వారిని జూపించగా రాజు వారితో మాట్లాడి తన వనములో పువ్వులన దేవతల కెందులకంతయిష్టమో యనియడుగ ఏకాదశాఫలవ్రతము వారుత్తరువిచ్చిరి. అప్పటియుండియు నారాజున్ను తనసామంతరాజునున్ను బంధువులున్ను స్నేహితులున్ను కూడ నేకాదశీవ్రతము చేయునటుల యేర్పాటుగావించెను. అందువలన మృతిజెందిన వారందను స్వర్గమునకే జనుచుండిరిగాని నొక్కడును నరకంబునకు బోకుండెను. అందువలన యమునకేమియు పనిలేకుండెను. ఇక తన యుద్యోగము నకు తప్పక మోసము వచ్చునని దలచి యముడు తన మహిషంబుపై నధిరోహించి బ్రహ్మదేవుని గొద్దకు బోయి చేతులు మొగిడ్చి తనయుద్యోగంబునూడదీయక యెట్లయిన నిలుపుమని ప్రార్థించుచు యిట్లు చెప్పెను. ఓ సృష్టికర్తా! ప్రపంచములో విదర్భ రాజగు రుక్మాంగదుడు దేవతలచే నేకాదశీమహాత్మ్యమును దెలిసికొని తన దేశమందంతటను నీవ్రతముపట్టు నుత్తరవు లందఱికిని జేసి అకాలమృత్యువుల నొందక అందరును స్వర్గమునకే బోవుచున్నారు. అందువలన నాపురికెవ్వరును వచ్చుచుండుటలేదు. నాయుద్యోగ మూడ పీకింతురని భయమవుచున్నదని చెప్ప, బ్రహ్మ యమునిజూచి యిట్లు చెప్పెను. ఓయి యమధర్మరాజా! నీవుపోయి నీపురంబున నుండుము నేనదంతయు జక్కపఱచెదను అనిచెప్ప కాలయముడు తన నిజవాసంబున కరిగెను. అంతట బ్రహ్మ వయోసుందరియు మిగుల లావణ్యవతియునగు నొక జగన్మోహినిని, నిర్మాణించి యామెతో నిట్లు జెప్పెను. ఓజగన్మోహినీ నీవుపోయి భూలోకంబుననుండు మందరగిరివద్ద

శృంగారవనమున గానము పాడుచుండుమన నామెయు నట్లేగావించెను. అంత నొకనాడు రుక్మాంగద మహారాజచ్చోటికే తెంచి నానా మృగములను వేటాడిజంపి యావనమును బాడుచేయు మృగముల నొక్కదానినైనను మిగులకుండ జేసి యొక్క సుందరమైన మాయ లేడిని గని దానినెట్లయిన దటిమి పట్టుకొనవలెనని యూహించి పట్ట బోయెను గాని నది వానిని కడుదూరము తీసికొనిపోగా అడవిలో మిగుల నలసిపోయి యెండ కోర్వజాలక చెమటలు పట్టినందున గుఱ్ఱము నొకచోట గట్టిపెట్టి యొక మఱ్ఱిచెట్టు నీడను బరుండి నిద్రించెను.

అంత గొంతసేపటికి లేచి కూర్చుండు నప్పటికి కమ్మని తావులు వెదజల్లు పరిమళంబులును రాజు ముక్కునకు విందు చేయుచుండెను. ఈసువాసన యెచ్చోటనుండి వచ్చుచున్నదని యాలోచింప వీనులకు విందుగొలుపు యొక సంగీతధ్వని వినవచ్చెను. ఆధ్వని యెచ్చటినుండి వచ్చుచున్నదో నచ్చోటికి బోవలెనని లేచి మెల్లనగదలి గిరిదరి జేరి కంఠధ్వనిని విని యాశ్చర్యమొంది యాలతాంగినిజూచి యచ్చోట నిల బడి దాని యందమునుజూచి యిది యింద్రాణియో, రంభయో యని భ్రాంతిజెంది యామెను నఖశిఖపర్యంతరము వర్ణించుచు వలపు సొలపుచు, తపించుచు, ఏమియును దోచక వెఱ్ఱివానిలాగున యిటు నటు నడయాడు రాజును వీక్షించి జగన్మోహిని సంతోషించుచు నాతడే రుక్మాంగదుడనియు తన్ను మోహించి యున్నాడనియు దెలిసి కొని నిర్లక్ష్యముగా తనత్రోవంబడి తాను వీణ వాయించుచుండెను. అంతరాజు మిగుల కామోద్దీపితుడై మెల్లన నయ్యిందువదన ప్రక్కకు జేరి, ఓ నారీరత్నమా! నీవెవ్వరి దానవు? ఎందుండి వచ్చినావు? నిర్మానుష్యమైన యీయరణ్యంబునకు రాగతంబేమన నామె యా రాజుంగాంచి అవనీశా! నేను బ్రహ్మయాజ్ఞచే బుట్టిన బ్రహ్మపుత్రి

కను, నన్ను జగన్మోహనాంగి యందురు. నాకాపురస్థలము బ్రహ్మ లోకమె నాకచ్చోట భర్తలేనందున యీభూలోకమున కేతెంచి ఏకాదశివ్రతము నిత్యము సలిపెడు పుణ్యాత్ముని, రాజును, పెండ్లియాడి సుఖంబున నుండవలెనని నిన్నుజూచి పాడుచుంటిని ; నీవట్టివాడవ్రవలె నున్నావన రాజందులకు మిగుల సంతసించి తరుణీ నేను విదర్భ దేశాధీనుడను నాపేరు రుక్మాంగద. నే నేకాదశీవ్రతము సలిపెదను. విష్ణుపూజజేయుచు మను నీతిప్రకారము నడచుకొందును. అట్టివాడను నేనేగదానీకేమియు కొదువలేదు రా రమ్మని చేయిపట్టియీడ్వ ఆపట్టి ఓరాజా ఆగుము నన్ను ముట్టబోకుము, నేజెప్పెటి వ్రతము వినుము, నావ్రతము జెల్లించినచో నిన్నుదప్పక వివాహమాడెదను అనిచెప్పగా రుక్మాంగదుడు కామోద్రేకంబున తప్పక జెల్లించెదనని జెప్పెను. అంత మోహిని యామెకు వలసిన వరంబు వలసినప్పుడు వేడెదనని యు తప్పక యాతడందుల కొప్పుకొని తప్పక జరిపెదనని ప్రమాణము చేయవలెననియు పలికి యట్లుప్రమాణము జేయించుకొనెను. వెంటనే హరిరూపుడును గాంధర్వ వివాహము గావించుకొని కేళీవిలాసముగ కాలక్షేపము జేయుచు సెలయేళ్ళలో జలక్రీడలాడుచు వనంబుల విశ్రమించుచు సంతోష సముద్రమున మునిగియుండిరి.

ఇట్లుండ యొకనాడు రుక్మాంగదుడు మోహినిం గాంచి ఓ యువతీ మనమీ యడవుల గ్రుమ్మరుట బాగుగాలేదు మనరాజ్యము నకు పోదము రమ్మని యామెను దీసికొని పురంబు ప్రవేశించెను. అంత వీరినిజూచి సంధ్యావళి మిగుల సంతసించి తనపుత్రుడగు ధర్మాంగదుని బిలిచి నాయనా నీతండ్రి రుక్మాంగదునికిన్ని నీపినతల్లి యగు మోహినికిన్ని కళ్యాణ మొనర్చవలెను గావున అందునకు గావలసిన సాధనసామగ్రులను ఆయత్తపరచి యేబదియారు దేశాధిపతులకు శుభలేఖలు వ్రాసి యొక సుముహూర్తంబున వివాహము

గావింపునున నాతడు నట్లే గావించెను. సంధ్యావళి తనపతికి మంగళ స్నానము జేయించి, ఆభరణములు, వలువలు పుష్పములు ధరింపజేసి కళ్యాణ మంటపమున గూర్చుండబెట్టి బ్రాహ్మణులచే వలసిన హోమాద్ధిక్రియలు జేయించి బ్రాహ్మణులాసీర్వదింప, దాసిలునాట్యము సలుప, భట్రాజులుకైవారము జెప్ప మోహిని కంఠంబున రుక్మాంగ దుడు మాంగళ్యసూత్రధారణ గావించెను. అంత దేవతలు పుష్పవర్ష ము గురిపింప రాజాధిరాజులు యీదంపతులజూచి మిగుల సంతసించ వివాహము ముగిసెను. అప్పటినుండియును రుక్మాంగదా మోహినులు జంటవదలక అతిప్రియమున మెలగుచుండిరి.

పిమ్మట గొంతకాలమునకు రుక్మాంగదమహారాజు కొమరుం డగుధర్మాంగనుడు రాజ్యమునకు పట్టాభిషిక్తుడై ధర్మాచారపరాయ ణుండై యెప్పటివలె రాజ్యమేలుచు ఒక యేకాదశిదినమున నేడే కా దశి మీరందరును ఉపవాసముండి పూజచేయువలెను సుమా,, యని పురమంతటను అన్నిసందులలోను గొందులలోను చాటింపు వేయిం చెను. ఈయేకాదశి మహాత్మ్యమన్నపలుకులు రుక్మాంగదుని చెవికి బడి తిరిగి ఏకాదశివ్రతము సంగతి జ్ఞాపకము దెచ్చికొని మోహిని నందువిడచి తానొక మూలకుబోయిభగవంతునిగూర్చితపస్సుజేయుచుం డెను. అంత నాజగన్మోహిని యిదేసమయమనియెంచిగితానారుక్మాంగ దునియొద్దకుబోయి రాజా యిదేమి నన్నొంటరి పాటున విడచివచ్చి యిచ్చోట గూర్చున్నావు? రారమ్మన యువతీ నేనిప్పుడు ఏకాదశీ వ్రతము సల్పుచు విష్ణువునారాధించు చున్నాను. మూడుదినముల వరకు నీవద్దకి రాను పొమ్మని రుక్మాంగదుడు ప్రత్యుత్తరమిచ్చెను. రాజా యిదేమేనా నీప్రతిజ్ఞ నేజెప్పినట్లెల్ల వినెదనని మొదట నుడివి యిప్పుడు నీయిష్టమువచ్చినట్లు సంచరించుచున్నావా? సరే కాని నీవు నాకు కావలసినప్పుడిచ్చెదనన్నవరం బుప్పుడిచ్చెదవాయని

యెదుర ఆ జూసరియే కోరుమనెను. అంత నయ్యబల యిట్లు జెప్పెను. "భూమీశా నీవీ యేకాదశీవ్రతమును మాని నావద్దకువచ్చి నాతో నుండి నన్ను రతిక్రీడల దేల్పుము" యీమాటలువిని రాజు నిశ్చేష్టుడై ఛీ ఛీ దుర్మార్గురాలా మూడుదినములవరకు నేను నీమోమును జూడ నొల్లను కావలసిన యిది దప్ప నుద్దియైన వరమును గోరిన తప్పక నిచ్చెదను నావ్రతము భంగముసేయకు మనిన ఓరాజా నీవు జేసినది వ్రతభంగముకాదా ? కోరిన వరమునిచ్చెదనని యివ్వకపోవుట సత్యవ్రతభంగముకాదా? ఇంతకంటె వేరేవ్రతభంగము కావలెనా ? సత్యవ్రతముకంటె యెక్కువ వ్రతమెచ్చటనున్నది ? మాటనిలుపలేని వానివ్రతమెంత పరిశుద్ధమైనను అడవిని గాచిన వెన్నెలవంటిది. ఇవన్నియు నీవు మాత్రమెఱుగనివియా ? రారమ్ము శయ్యపై గూర్చుందుమని లాగిన మోహినిని జూచి ఛీ ఛీ నన్ను విడువుము అని కసరి త్రోచివైచి యామహావిష్ణువునుగూర్చి పూజలొనర్చుచుండిన రుక్మాంగదుని జూచి మోహిని తిరిగి యిట్లు జెప్పెను. రాజా యెంతపాపమున కొడగట్టితివి నన్నిట్లు త్రోసిపుచ్చుట న్యాయమా ? పెండ్లి నాటిమాటలు కంకణములనాటికుండవు గాబోలునని చెప్పి సరే రాజా నీవన్నట్లు నాకుమరొక వరమిమ్ము అదియేదన నాయభిప్రాయమునకు బదులు నీకొమారుని యొక్క శిరస్సునిమ్ము. అట్లిచ్చినచో నే మొదటగోరిన వరమున కీవరము సరిపుచ్చుకొనెదననెను. ఈపలుకులు రాజుకు కర్ణకఠోరములై యుండ ఆహా ! ఈమె యెంతటి నిర్దయురాలు. నాకు మిగుల సుగుణవంతుడగు నొక్కడే కుమారుడు గలడు. అట్టివాని శిరస్సెటుల నివ్వగలనని దిగులొంది విచారించుచు నూరకుండెను.

అంతఃపురంబున ధర్మాంగదు డేకాదశీవ్రతంబునకు తనకును జనకునికిని తన యింటగలవానికి అంతయు సిద్ధపరచియుండగా తండ్రి

యెప్పకిని రానందున తండ్రియెందువలన రాలేదో కారణ మరసి రమ్మని తల్లినంపెను. సంధ్యావళి సవతియగు రుక్మాంగద యింటికి జని కారణములను దెలిసికొని మిగుల చింతనొంది సవతింగ్గైకొని నీకిదేమి కోరిక యని యడిగిన యామె నాకు పూర్వమీతాత డిట్టివరముల నిచ్చి యున్నాడు గాన కోరితినని యామె బదులుచెప్పెను. పూర్వము యిక్ష్వాకులుడగు హరిశ్చంద్రుడు సత్యమునకై యెన్నిపాట్లుపడి ప్రఖ్యాతిగాంచెనో నీభర్తకు బోధించుము సత్యవ్రతములేనిచో యిప్పుడు మీ యినకులమునకు అప్రఖ్యాతి వచ్చుననిగూడ జెప్పుము అనిగూడ మోహిని సంధ్యావళికి జెప్పిన విని యామె యంతఃపురము నకు బోయెను.

అవ్విధముగా వచ్చినమాతను గాంచి ధర్మాంగదు డచ్చోటను గల యావత్తువృత్తాంతమును దెలిసి కొంచి తల్లినితీసికొని పినతల్లి గృహంబునకు జని ఆమెక్కు వందనంబాచరించి తండ్రికి నమస్కరించి తండ్రికిట్లు చెప్పెను. తండ్రీ యిచ్చిన మాటను నిలుచుకొని సత్య వ్రతమునకు కట్టుబడి యుండవలెను గాని యిట్టి విచారము, అధైర్య మెందులకు? నాపినతల్లికి నాసిరస్సునిచ్చుటకునీకుసందియ మేల? లేలె మ్మని చెప్పగా సుతునిమాట లాలకించి జనకుడుదిగులుజెంది రాయి వలె గూర్చుండెను. అందుచే తిరిగి కుమారుడిట్లు చెప్పెను. జనకా పూర్వము మనతాత ముత్తాతలగు శిబిచక్రవర్తి మొదలగు వారిచ్చిన మాటకును సత్యమునకు కట్టువడి తన శరీరమందలి మాంసమును గోసి యివ్వలేదా! అట్టివారికెట్టి ప్రఖ్యాతి వచ్చెనో మనకుగూడ నట్టిదే రావలయును గాని మనము వెనుక దీయుట బాగానా? గావున వెంటనే నాశిరస్సు దీయించి నాపినతల్లిగారగు మోహిని కిచ్చి యామెను సంతుష్ట హృదయురాలిని గావింపుము సంశయింపకుము. అనగా విని ధైర్యము దెచ్చుకొని దుఃఖములోనడంచుకొని కరవాల

ము నొకదానిని బుచ్చుకొని తన భార్యయగు సంధ్యావళిని బిలిచి నీవు జడియక మన ముద్దులకుమారుని గట్టిగబట్టుకొను మన నామె యు ధైర్యముగ నాతని బట్టుకొనెను. అప్పుడు రుక్మాంగద మహా రాజాతని కుమారునిపై నొకవ్రేటు వేయగా యది తెగక పుష్పమాల యొకటి క్రిందబడెను. అంతరాజు మిగుల కోపగించుకొని రెండవ వ్రేటు వేయుతఱిని దీనదయాకరుం డేతెంచి ఓరాజా ఆగుమాగుము నీవు మహాసత్యవ్రతుండవు. నీభార్య పరమసాధ్వీరత్నము. నీపుత్రుం డుత్తముడు. మీరుచేయు వ్రతములు మంచివి. మిమ్ములను గాంచుటే మాకు కన్నులవై కుంఠము. అనిజెప్పి రత్నఖచితమగు నొక విమాన ముపై వారందఱి నెక్కించుకొని విష్ణువును దర్శించి వైకుంఠమందిరి. చదువరులారా గమనించితిరా ! ఈమహాపతివ్రతయగు సంధ్యావళి, తనభర్త మఱి 99 మంది కన్యకలను వివాహము జేసికొన్నప్పటికిని తిరిగి మోహినిని వివాహము జేసికొన్నప్పటిని తనభర్తనే దైవముగా బూజించుచు తనభర్త సౌఖ్యముకొఱకు తనకుమారుని ప్రాణములను సైతమిచ్చుటకు సిద్ధపడెను. ఆహా ఆమె పాతివ్రత్యమ ! ఆమెశీలము ! ఆమె పతిభక్తి !

సంధ్యావళీదేవి చరిత్ర సంపూర్ణము.



# 18 నళినీదేవి చరిత్రము

పెక్కువేల వర్షముల క్రిందట నళుండను రాజుండెను. ఆతడు ధర్మాచారపరాయణుండును జనోపకారియునై రాజ్యము సేయుచుండెను. ఆరాజునకు నళిని యను పుత్రికారత్నంబు గలదు. ఆమె మిగుల రూపవతియై యుండుటవలన వేయినాలుకలు గల్గిన యాదిశేషునకే యామెను వర్ణించుట కలవిగాకుండగా, ఇక నామెను వర్ణించుటకు నే నెంతటివాడను. ఆమె రూపురేఖావిలాసములతోనే గాక వినయాది సద్గుణములచే గూడ విలసిల్లుచు శుక్లపక్ష చంద్రునివలె దినక్రమంబున వర్ధిల్లుచు తల్లిదండ్రులకు హితవచనంబులు బల్కుచుండ గొన్నాళ్ళ కామెకు యౌవనప్రాయము వచ్చెను. అంత వేర్వేరు రాజోత్తములు నళునియొద్దకు వచ్చి తనపుత్రికను వారికియ్యమని కోరగా నారాజు ఓరాజోత్తములారా నాబిడ్డ తనంతట తాను వివాహమన్న నేదియో దెలిసికొని యెవ్వరినైన మోహించి యామె నన్నడుగువరకు నే నామెకు కళ్యాణ మొనర్ప జాలనన నారాజకుమారులు సిగ్గుజెంది వెడలి పోవుచుండిరి

ఇవ్విధంబున కొంతకాల మగునరికి నళినీదేవికి వివాహమునందపేక్ష పుట్టినందున ఈవర్తమానము తనదాదులకు జెప్పి తండ్రికి కబురు పంపించెను. ఆరాజును మంత్రిప్రధానులతో తన కుమార్తెకు తగిన వరుడెందున్నాడని యాలోచించుచుండ కాషాయవస్త్రములను దాల్చి కమండలములను చేతబుచ్చుకొని మూరెడు పొడుగు గడ్డముగలిగి జటలుగా నల్లుకొన్న జుట్టుముడి ముంగురువద్దగలిగి, విభూతి మేనెల్ల బూసికొని రుద్రాక్షల వేసికొని వ్యాఘ్రచర్మధరుండై సాక్షాత్తు శంకరునివలె వచ్చి నారాజున కట్టెదుట నిలువంబడెను. ఆరాజును

నమ్మునివరునికి నమస్కరించి యర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించి తగు పీఠంబున గూర్చుండబెట్టి అంజలీబద్ధుండై ఓతాపసోత్తమా! తమ వంటి ఋషిసత్తములు మావంటి రాజుల గృహంబుల కూరక విచ్చే యరు. మాగృహము మీరాకవలన పావన మైనది. మేము ధన్యుల మైతిమి. తమరు మాయందు దయయుంచి తమరాకకుగల గతంబెద్ది యన రాజునుగాంచి మునివర్యు డిట్లుత్తర మిచ్చెను. రాజాధిరాజా! నేను వచ్చిన కార్యంబెద్దియును లేదు. అది మిగుల చిన్నది; నీకు శక్యమగునట్టిది. గావున నట్టిస్వల్పకార్యమును నెరవేర్తునని బలికిన నాకు బరమసంతోషమగునని పల్క రాజు యీతని కోరిక నిచ్చెదనని యివ్వకపోయినను కోరనే వలదన్నను యీతడెట్టి శాపమును బెట్టునో యని తనమనంబున దలంచి సన్యాసినిజూచి తాపసోత్తమా తమ యాజ్ఞప్రకార మట్లే జరిపించెదను. ఆనతీయుడన మునివర్యు డిట్లు చెప్ప దొడంగెను. "ఓరాజా! నేనొకమునినై యడవులకుబోయి యీశ్వర ధ్యానమును గావించుచుండ నాకు వివాహము జేసికొనవలెనని బుద్ధి పుట్టి యిచ్చోటికి వచ్చితిని గాన నీకుమార్తెను నాకు పాణిగ్రహణం బొనర్చి పుణ్యము గట్టుకొనుము" అందునకు రాజు "స్వామీ తమయిష్ట ప్రకారము నాకుమార్తెయగు నళినిని మీకిచ్చుటకు నెంతమాత్ర మును సందియము లేదుగాని ముందుగా నీవామె యంతఃపురమునకు బోయి యామె నిన్నువివాహమాడుట కొడంబడిచి యామె యొప్పు కొన్నచో యామె యుంగరమును గొనితెమ్ము" అనిచెప్పెను. అంత నాముని యందులకు సమ్మతించి యక్కన్నియ యంతఃపురమునకు బోవుచు మన్మథునిగూర్చి యిట్లు తలంచెను. "ఓనమమన్మథా! నేను యీకన్నియను వివాహ మాడబోవుచున్నాను. నేనీవేషమునబోయిన యామె నన్ను మోహించదు. అందుచేనీవు నాయందు దయయుంచి యామెవద్దకిబోయి యుంగరమును దెచ్చువరకును నీవు నాయందను గ్రహించి నీరూపమును నాకిమ్ము" ఈమాటలన్నియు జెప్పునరికి

ఋషి నవమన్మధునివలె నుండె అంత తిన్నగా నానళిని గదికిబోయి తన యభిప్రాయం బెఱింగింప నామెయు నతని యందమునకు మెచ్చి తన యుంగరమిచ్చి పంపించెను.

అంత తిరిగి వచ్చునప్పుడు తన నిజరూపమును ధరించిన ముని వర్యుడు రాజును దర్శించి యుంగర మానవాలుగా జూపించగా నా రాజది నిజముగ కుమార్తె చేతియుంగరమని దలంచి యేమియు దోచక కూతును రావించి పట్టీ నీయుంగర మీముసలి మునికేల యిచ్చితివి నీవితనికియెట్లు భార్యవగుట కిష్టపడితివనియడుగ నామె "తండ్రీ! నావ్రేలి యుంగరమును గొనివచ్చిన యతండీతడు గాడే ఆతడు చాల సౌందర్యముగ నున్నవాడు. ఇదిజాల మోసముగానున్న దనకుమార్తె నుజూచి రాజు అమ్మా వెనుకవచ్చి నన్నడిగినవారును యిప్పుడు నీగదికివచ్చి నీయుంగరంబు దెచ్చినవారును నొకరే. క్రొత్తవారెవరును రాలేదు. మాటయిచ్చితి మిక బాగుగ నుండదు. గావున నీవుతప్పక నీతని వివాహాము జేసికొని సుఖంబున నుండుము నెను.

అంత నారాకుమారియగు నళినియు చాలసేపు యోజించి మనంబున మిగుల దిగులొంది, విచారించి "నుదుటన్ వ్రాసిన వ్రాలుకన్నగలదే నూరేండ్లు చింతించినన్" యని దైవంబును దూరుచు నిట్టూర్పు విడుచుచు ఎట్టకేలకు మనంబు దిట్టపఱిచికొని యిది యంతయు తనపురాకృత ఫలమనియు, తననోముల ఫలమనియు దలచి జనకుని వీక్షించి తండ్రీ తమ యుద్దేశ్యప్రకారము నన్నాతనకిచ్చి యట్లే వివాహ మొనరింపుడ నెను. తండ్రి అందులకుసమ్మతించి మంత్రిసామంతాది పురోహిత బంధు స్నేహితజనంబులను రావించి యొక శుభముహూర్తమున భూరికాహాళధ్వనులు మెఱయ మాంగల్యమంది నమ్ముని నళిని కంఠంబున సూత్రంబువేసిన లక్షణంబుగా వివాహము జరిగెను. అంత నద్దంపతులను గాంచిన ప్రజలెల్లు

తమలో దామ చెప్పుకొనసాగిరి. అహా యిదేటివింత యీరాజు తనరూపవతియగు కుమార్తెను నట్టిమునికిచ్చి వివాహం బొనరించె నేమియని కొందఱును, అట్టిరూపవతిని వివాహము జేసికొన్న యీ మునిభాగ్య మేమనవచ్చునని కొందరును, రాజీతనియందే దో దేవతా శక్తినిగాంచి యిట్లుచేసెనని కొందఱును, మౌనియగుటవలన రాజు నెట్లో మోసపుచ్చి యిట్లుజేసి యుండవచ్చునని మఱి కొందఱును పలువిధముల దలంచిరి.

పిదప మాత్కల్యమహాముని రాజువద్ద సెలవు గైకొని బహు మతులందుకొని తన భార్యయగు నళినితో యిట్లుచెప్పెను. కాంతా! కాంతారములకు బోయెడి నాతో నీవు వచ్చెదవా? లేక నీజనకుని యింట గారాబంబుననుండి యాడుకొనెదవా? అని యడిగిన భర్తం గాంచి నమస్కరించి ఓస్వామీ! తామీనగరును విడిచిపోవు చున్నప్పుడు నేనిచ్చోట నుండిన నేమిఫలము సతికి పతితోడిదెస్వర్గము. నేను మీవెంటరానిచో నాపతివ్రతాతన మేముండును? గావు ననన్నుగూడ తమవెంట గొనిపొండని జవాబిచ్చెను. అందున కామునిపుంగవుండు ఓ నారీరత్నమా నీవు నావెంటవచ్చెదననుచున్నావు గదా! నేపోవు ప్రదేశ ములతిభయంకరములగు నరణ్యంబులు. నీజనకుని నగరువలె నుండవు. ఏలాగున రాగలవన నాయింతి మాత్కల్య మహామునిం గాంచి అర ణ్యంబు ఘోరముగాని పతిభక్తి ఘోరమా! అరణ్యములలో మీతోబాటు కందమూలంబులను భక్షించుచు నీరుత్రాగుచు గాలి పీల్చుచు, నుండగలనని చెప్పెను. అందున కాముని యింకను నామెను భయపెట్టదలంచి అబలా! అరణ్యంబులలో ఘోరములగు పులులు, సింహములు, అడవిపందులు. యేనుగులు, చిఱుతలు, శివంగులు, యెలుగులు మొదలగు వాటిని చూచి నీవు తప్పక భయమందెదవు నేనొంటరిగా నొకమూల తపస్సు చేసుకొందును. నీవట్టి యరణ్యములో నొంటరిగా నెట్లుండగలవు? అని పశ్నించిన నాసళిని యిట్లు జెప్పెను.

నాథా నన్నట్టి బాధలనుండి దప్పింప మీారశక్తులా? అడవియందు భయమైనను, సర్పంబులు గరచినను, మృగంబులు మింగినను, పక్షులు గాయములు గావించినను, పానముచేయుటకు పానీయము లేకపోయినను సరేగాని నేను మిమ్ము వదలియుండలేను, మీావెంటనే వచ్చెదన నేను.

అంత నామాని తన భార్యనింకను భయపెట్టదలచి ఓయింతీ నేను పూజలుజేసికొనుటకు దగినపువ్వులు దెచ్చియు, పాత్రలు శుద్ధి చేసి నాకు గావలసిన ఇతర ఉపచారములను జేసియు నిశలయందు నిద్రను విడచియుండుట దుస్తరంబు ఆదియుగాక నీవు లేబ్రాయపు దానవు. నేముసలివాడను నాతో నీకు రతియపేక్ష లెట్లుదీరును? నేనొకచోట నుండినట్లేయుండి తక్షణమే మరియొకచోటికి బోవువాడను. నీవిట్టి దురవస్థల జెందుటకంటె నీజనకుని యింటనుండి సఖీజనంబుల మధ్యంబున సంతోషముగనుండి వనముల దిరుగుచు ఆడుచు పాడుచునుండక బలాత్కారముగా నావెంట కాననములకు వచ్చుట నీకెట్టిప్రయోజనమని చెప్పగా నదివిని యా రాకుమారిట్లు చెప్పెను. ప్రాణేశ్వరా! భర్తను విడచియుండు యింతులకు పరమసార్థకంబు వ్రతశీలు లేదని చెప్పుదురు. అదియుగాక లోకంబున నరజన్మంబు మిగుల శ్రేయమేగాని స్త్రీయై పుట్టుట మిగుల పాపము అట్టి పాపము బోగొట్టుటకు మగడు తక్క యితర దైవములేడు గావున అబలనైన నేను పతియే దైవమని పూజించుకొనుచు వారి పేరే తిరుమంత్రమనిదలంచి సుశీలనై అత్తవారింటికిని పుట్టినింటికిని ఖ్యాతిని దేవలసియున్నది. పూర్వము శ్రీరామచంద్రుడడవులకు బోవునపుడు సీతను గొనిపోవలేదా? హరిశ్చంద్రుడు కష్టములపాలైనపుడు చంద్రమతి పాల్గొనలేదా? నలుడు రాజ్యమోడినపుడు దమయంతి నలునితో కానలకేగలేదా? కైలాసపతి హిమవత్పర్వతమునందు తపస్సు

జేయుటకోగా పార్వతి యెడబాసి యుండెనా? యని యడిగిన నాపలు కులాలకించి యాఋషి యోమందగమనా! సరే నీవు నావెంట రావచ్చునుగాని నీవు నావలెనే నారచీరలు గట్టుకొని నగలు దీసి వైచి జడలు దాల్చి రమ్మని యాజ్ఞాపించెను. ఆమెయు నట్లే ధరించుకొని నిలువబడగా ముని తనభార్యం దీసికొని బహుదూరము నున్న గంగానదీ తీరమందున్న యొక యడవికి బోయి యందు తపస్సు గావించుకొనుచుండెను.

అట్లు తపస్సు గావింపుచున్న భర్తకు నళినీదేవి సమస్త యుపచారములను జేయుచు పూజపాత్రలను సిద్ధముజేయుచు పతిని దైవముగ దలంచి యుండ నమ్ముని విషయాసక్తులను వీడి యామెను ముట్టుకొనకుండెను. అట్టి మునికి శరీరమంతయు కుష్టురోగంబు రాగా చీముగారుచు, కండ లూడిపడుచు, పురుగులు పుచ్చి దుర్వాసన వచ్చి దగ్గర జేరనసహ్యముగా నుండెను అయినప్పటికి నప్పరమ పతివ్రతయగు నళిని యది తన యదృష్టమని దలంచి దుఃఖించి అసహ్యపడక తానే తనభర్తను మోసికొనిపోయి నొక యొద్దున గంగలో స్నానము జేయించి తన చీరచెంగుచే, చీము, నెత్తురు దుడిచి తిన్నగా యెప్పటిస్థలమునకు గొనివచ్చి భర్తకు దినిపించి శేషించిన దానిని తానును దిని అతని కాళ్ళొత్తుచు నిద్రయిచ్చుచు భర్త కష్టములే తనకష్టములనుగా దలంచి కాపాడుచుండెను. ఇదంతయు గాంచి నమ్ముని మిగుల సంతసించి యామె పాతివ్రత్యమునకు మెచ్చుకొని యింకను బరీక్షింపదలచి తన చిటికి వ్రేలూడి తాను భుజించిన పాత్రయందలి ఆహారములో బడునట్లు జేసెను. మహాపతివ్రతాశిరోమణి గనుక ఆయిల్లాలది గని యసహ్యపడక తాను శేషించిన దానిని భుజించు దలనిభోజనమునకు గూర్చుండి నప్పుడా వ్రేలిని మెల్లదీసి యొకచోటనుంచి భోజనముచేసెను. దానిని గాంచి ముని శ్రేష్ఠుడింకను

బరీక్షించ దలంచి యారాకుమారిని కాళ్ళతో దన్నియు చేతులతో గొట్టియు, నోటదిట్టియు తంటాలు పెట్టసాగెను. ఆమె దానికి విసుగు కొనక నెపమెంచక ఓర్పుగలిగి యింకను నెక్కువ యుపచారములు జేయుచుండెను.

ఇట్లు చేయుచున్నను యామునికి తనివిదీరక యింకను నామె బరీక్షింపదలచి యాకన్నియనుగాంచి ఓసీపాపీ! దుర్మార్గురాలా! నీవెంతటి పాపాత్మురాలవో నేనెఱుగను నిన్ను వివాహము జేసికొని నది మొదలు నాశరీరమిట్లులైనది. యిన్ని కష్టంబు లనుభవించు చున్నాడను. ఈరోగంబు నిన్నంటి నాకువచ్చినది గాని వేరుగాదు. నేను నిర్భాగ్యుడనై నిన్నేల బెండ్లియాడితిని. ఇదియంతయు నాగ్రహ చారముగా బోలునని పలువిధములదిట్టి విసుగుకొనెను. అంత నతని భార్య భర్తపదములపై బడి స్వామీ! నేనేమి చేయగలదానను నాకు వలయినన్నియుపచారముల గావించుచుంటిని గాని మీవ్యాధి మాన్పగలుగుదునా? నన్నెట్లు బలికినను సరేగాని నాకు మీరుదక్క మరియెవ్వరుదిక్కని ప్రార్థింప అట్లయినచో నీవు నన్నీదేశంబునం గల పుణ్యతీర్థము లన్నిటియందును ద్రిప్పి అన్నిచోట్లను స్నానములు చేయించుమని ఋషిపుంగవుం డుత్తరువిచ్చెను. ఆమెయు నట్లే తన భర్తను భయభక్తి వినయాదులనెత్తికొని రక్తంబులుగార, చీముల తోను, మాంసంబులతోను వాసనలు గొట్టుచుండగా రోతలేక గొని పోయెను.

అవ్విధమున తీసికొని పోవుచుండగా చీకటి పడెను. దగ్గరనున్న పురంబున నారేయిగడిపి మరునాడు లేచి పోవుదమని తలంచి యా పురంబుజొచ్చి అన్నంబు అడుగుకొని తెచ్చి భర్తకు తినిపించిన శేష మును దానుతిని భర్తనొకచోట పడకవేసి పరుండబెట్టెను. అంత నాముని మొగము మిగుల విచారమును సూచించుచుండ దానింగని

నళిని నేడు మీా మెుగమేల యిటులవాడియున్నదని పలికెను. అంతన కాతడు చిన్నదానా! నేనాపని నీతోజెప్పినచో నీమనంబు నొచ్చక మానదు గావున నేనుజెప్పిన ప్రయోజనమేమి అనెను. అందునకామె స్వామీా! తమకిష్టంబగు కార్యంబులు జెప్పినచో నాకుసాధ్యమగు నెట్టిదానినైనను గావించెద ననెను. అంతట కాతడు ముద్దుగుమ్మ కోపములేక విసుగుజెందక జేసెదనని ప్రతిజ్ఞచేయించుకొని, లలితా నేనీపట్టణమున రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమయనెడు దేవవేశ్య లను మించిన నొకవెలయాలిని గాంచితి నట్టి సుందరాంగిని వీక్షించి నదిమొదలు నామనసు నెమ్మది లేక కామోద్రేకంబున మునిగియున్న వాడను. దానినెట్లయిన నాకొదవు నట్లు జేయుమనెను.

అందులకామందగమన ధైర్యంబుబూని మొదట యేమియు నుపాయము దోచక ఎట్టకేల కొక యుపాయమును గనిపెట్టి ప్రతిదిన ము తా నుదయముననే లేచి యావేశ్యకాంత యింటికరిగి వీధిగుమ్మ ము శుభ్రముగ దుడిచి యలికి ముగ్గులుపెట్టి వచ్చుచుండి అడుగు కొని తెచ్చిన యన్నముచే భర్తను పోషించు చుండెను. అంత నా వారకాంత దాసీజనంబు లాముగ్గులను గాంచి తమ యజమాను రాలికి వర్తమానము జెప్ప యామె చీకటిలో నొకమూల డాగియుండి యెల్లెనను నీరాత్రి యామెను బట్టవలయునని తన దాసీజనంబుల కుత్తరువిడెను. వారట్లే గనిపెట్టుకొనియుండ మామూలుగానే నళిని వచ్చి తుడుచుచుండ వారామెను బట్టుకొని తమ యజమానురాలి కొప్పగించిరి. ఆమె నళినింజూచి యామె సౌందర్యమునకు మెచ్చుకొని అమ్మా! నీవు దేవభామినివలె నున్నావు. ప్రతిదిన మిాలాగునవచ్చి ముగ్గుబెట్టుటకు కారణమేమి నావలన నీకగుకార్యం బేమిగలదన నళిని యిట్లు చెప్పెను. నీవలన నాకొక చిన్నపనిగలదు నీవు దానిని తప్పక జేసెదనని వాగ్దాన మొనరించిన జెప్పెదనన నావారకాంత

తప్పక యట్లు చేయుదు నేమివలయునో జెప్పుమనెను. అటుపిమ్మట నళినీదేవి తన వివాహము అయినది మొదలుకొని అప్పటివరకును జరిగిన తనభర్త కథను జెప్ప యామె అందుల కచ్చెరువొంది సరే నీభర్త నీరాత్రియే యిచ్చుటకు గొనిరమ్ము అనెను. అంత మహా పతివ్రతారత్నమగు నానళినీదేవి తనభర్త నొక గంపలో బెట్టుకొని తిన్నగా భోగము దాసియింటికి రాగా భర్త యామెను వీధిలోనే యుండుమనియు తాను తిరిగివచ్చి పిలిచెదననియు జెప్పి లోనికిబోవుచు మన్మథుని దలచి మంచిరూపంబు వహించి భోగము దానిని సమీపించెను. నళినీదేవి వీధియరుగుమీద గంపవద్ద పతిని దైవముగా దలంచును నా రాత్రియంతయు కాలక్షేపము జేయుచుండెను.

ఇది యిట్లుండ లోపల నావెలయాలు నవ మన్మథాకారము గలిగిన యాసుందర విగ్రహమును చూచి ఆహా యీతడెంతయుంద మగనున్నాడు? యీతడింద్రుడో, విష్ణువో, మన్మథుడో, యెయుండ నోపునని యచ్చెరు వొంది యాతని భోగింపని జన్మ మెందుకని దలంచి గట్టిగ నతని చేయిబట్టుకొని తన శయన గృహంబునకు గొనిపోయి యాగృహంబిదివరకే బాగుగ నలంకరింప బడియున్నదిగాన యందు గూర్చుండ బెట్టి కీళ్ళ బొమ్మలచే నాతనికి విసరింపుచు, తాంబూలాది కప్పురంపు వీడెంబులు సమర్పించి నిండు మందహాసముతో వందనం బాచరించి యాతని శయ్యపై జేర్చి దృష్టితీసి ముద్దుబెట్టుకొని కౌగలించుకొని ఆతనితో ఆహా నీయట్టి రూపమిదివర కెన్నడుకు నేను జూచి యుండలేదు నాయదృష్టవశమున నిన్ననుభవించుచుంటిని అనిచెప్పి అట్టిదివ్యపురుషుని బాగుగ జూచి అహోయింతటి తేజోవంతుని నిన్ను కుష్ఠురోగియని చెప్పుటకు నీసతికి మనసెట్లొప్పెను? ఒప్పినను నవమన్మథునివంటి నిన్ను నాకొప్పగించి మనసెట్లునిల్పగలిగినది? ఒప్పగించి నందులకట్టి సాధ్వికి నేనేమి ప్రత్యుపకారము జేయగలనని బలికెను,

అందులకామెను వేశ్యనుగూర్చి ఓసీ నీవీరహస్యమును నాభార్యకుగాని యితరులకు గాని జెప్పినచో నీతల వేయి ముక్కలగునట్లుభయపెట్టి యారాత్రియంతయు గడపి తెల్లవారగనే వీధిగుమ్మములోనికి తనకుష్ఠురోగపు వేషమునవచ్చి హీనస్వరముతో భార్యను బిలిచెను. ఆమెస్వామీ! యిదుగో సిద్ధముగనున్నాను అని జాగ్రత్తగ భర్తనెత్తుకొని తట్టయందు గూర్చుండబెట్టికొని తట్టతల మీదబెట్టుకొని తన త్రోవకుబోయెను.

ఈవిధముగా తట్టయందు తనభర్తను గూర్చుండబెట్టుకొని యూరూరదిరుగుచు నాపతివ్రత యొకపురమునకు వచ్చెను. ఆపట్టణపు రాజు న్యాయన్యాయముల విచారింప లేక పుణ్యాత్ముడని యెరుగక మాండవ్యుడను మహాఋషిని నొక యుక్కుస్తంభమునకు వ్రేలాడ గట్టించెను. ఆమాండవ్యుడు ప్రాణము పోనందున మిగులబాధపడుచు నటునిటు యూగులాడుచుండెను. మన నళినీదేవచ్చోటికి వచ్చునప్పటికి చీకటిపడి ఉరుముల తోను మెరుముల తోను ఆకసమంతయు మబ్బుగ్రమ్మి బోరున వర్షించెను. అందువలన నామెకు దారిసరిగ తెలియక నాయుక్కుస్తంభమువద్దనుండి బోవుచుండ తనతలపైనున్నగంప యామునికి దగిలి యాతనికి మరింత బాధహెచ్చినందున “కంష్టు తెలియక నన్నుగదల్చిన యాయువతీమణి ప్రొద్దు తెల్లవారగనే తెగిపో„ గాక యతి శాపంబిచ్చెను. అందున కామె మిగుల భయపడి దైవమా నాయందేమియుతప్పిదము లేదుగదా! నన్నేలశపించవలెను? కానిమ్ము నేను మహాపతివ్రత నగుదునేని తెల్లవారరాదని శాపమిచ్చెను. అంత ఎన్నిది దినములు యేకరాత్రియైపోయెను.

దీనినిగూర్చి దేవేంద్రాదిమునులు మిగుల భీతిల్లి యెందువలన నీకారణము గలిగెనని దెలిసికొని మాండవ్యుని వద్దకు వచ్చి స్వామీ రక్షింపుడని వేడిన నాతడు ఋషిపత్నియగు నళినీ దేవి వద్దకు పొండని పంపెను. అంత వారందరామె వద్దకు వచ్చి తల్లీ తెల్లవారు నటుల

అనుజ్ఞనిమ్ము అనగా నేనెట్లు శాపముచుతీయగలను నాభర్తచనిపోగలడు గావున నావల్లగాద నెను. అందునకు దేవతలిట్లనిరి. "అమ్మా పెక్కు లక్షలమందికి ఉపకారము జేయుటకై నను నీవు తెల్లవార ననుజ్ఞనీయ వలసియున్నది" అని చెప్ప ఆహా యివేటిమాటలు నాపతిని విడచి యుండుటకంటె నేజచ్చుట మేలు. నేను పతిని విడచియుండ లేన నెను. అంత దేవతలామె భర్తయగు మాండల్యుని జూచి స్వామీ తామైన యీకష్టమును వారించుడన నాతడు తన భార్యవల్లదక్క తదితరుల వలన గాదని చెప్పెను. అపుడు దేవత లందరును గలిసి నళినీదేవి నామాండవ్యమహర్షి యొద్దకు గొనిపోయి యాతని బ్రతిమాలి యామె ను సుమంగలియై యుండు నట్లు దీవించుడని చెప్పి యట్లే చేయించిరి. అంతనామె ఎప్పటియట్లు తెల్లవారుగాక యని శాపవిమోచనము జేయగా తెల్లవారుచు సాయంత్రమగుచుండెను.

పిదపనా మాండల్యముని మిగులసంతసించి నళినీదేవింగాంచి ఓయింతీ నేముసలి వాడనుగాను, కుష్టురోగినిగాను. నీభక్తికిమెచ్చి నీకేమివలయునో గోరుమిచ్చెదనన స్వామీ ఐదురూపంబుల నన్ను బొందుచుండుము. నాకు మరుజన్మమున నీవే భర్తవగునటుల వరం బిమ్ము అని నళినీదేవి చెప్పగా నామెభర్త సరియేయనగా వారు సుఖముగానుండి చాలకాలము గడచిన పిదప వైకుంఠపదవినొందిరి

నళినీదేవి చరిత్ర సంపూర్ణము.



# 19. సుమతీదేవి చరిత్రము.

——:○:0:○:——

చాలవర్షంబులక్రిందట అధిష్టానపురంబున కౌశికుండను నొక విప్రుడు సుమతియను కన్యను బెండ్లియాడి యామెతో కలసిమెలసి యుండక రతిభోగములం దామెను సంతోషపరచక పరస్త్రీలోలుండై అందరిచేతను దూషింపబడుచు సదా పాపకృత్యములనే సేయుచు, సాధుసంగత్యమును వీడి దుర్జనసాంగత్యమే చేయుచుః పిత్రార్జిత మగు యాస్తినంతను దుర్వ్యాపారములకే వినియోగించుచు వొక్క నాడు తండ్రి శ్రార్థంబు బెట్టియు గూడనొక వేశ్యకాంతయింటికి బోవుచు భార్యనుబిలచి ఓసీ నేనిప్పుడు బోగముదానినింటికి బోవు చున్నాను. నీవు రాత్రి రెండుఝాములకు విస్తారము గారెలు, బూరెలు అరిసెలు పట్టుకొని దానిగృహమునకు రమ్మని యాజ్ఞాపించెను. ఆతనిభార్యయు భర్తయాజ్ఞప్రకారము భక్ష్యములను సమకూర్చుకొని తలమీద బెట్టుకొని మోసికొనివచ్చి భర్తనే దైవముగా నమ్మి ధ్యానించుచు అర్ధరాత్రిమున మిగులచీకటిలో బట్టుకొనివచ్చి భర్తముందుంచెను. ఆభక్ష్యముల నాతండును నాతనిభార్యయు గలసి తిని నయ్యాటలదేలి ఓసి పాపిష్ఠి నేను నిన్ను మరిరెండు యెక్కువ దెమ్మంటే ఈకొంచెమే దెచ్చితివేమి? ఛీ ఛీ పొమ్ము నాయెదుట నిక నిలబడకుము అని కాళ్లతోదన్ని కంఠంబు బట్టికొని బిరబిర వీధిలోని కీడ్చికొనిపోయి యచ్చోట బడద్రోసి పొమ్మనెను.

పిమ్మట సుమతీదేవి మనస్సున కొంచెమైనను గోపింపక తన దారింబడి యింటికి బోవుచుండ మార్గములో నొక పెనుబాము గనిపించెను. దానినిజూచి ఓ సర్పమా నీవైన నన్ను మ్రింగి పుణ్యము గట్టుకొనరాదాయని దగ్గరకుబోవ నది బిరబిర పాఱిపోవుచుండెను.

అంత నామె దాని కడ్డముబోయి పట్టుకొనబోవ నది యొకధర్మదేవత యై అమ్మా! నీమనంబుననున్నదానిని నేను గుర్తెరిగితిని నీభర్త నిన్ను పలుబాముల బెట్టుచున్నాడు నీకువచ్చిన భయములేదు భగవ ధ్యానము చేయుమన, సుమతి యాదేవతను గాంచి నీవు నాపాలిటి దేవతవుగావున పునరావృత్తిరహితంబుగ నిర్వాణపదసుఖం బేజీపున కెట్లు గలుగునో జెప్పుమన నద్దేవత యిట్లు చెప్పదొడంగెను. పురు షుండు కర్మదేహములచే నుప్పతిల్లు. ధర్మార్థకామములు. జ్ఞానలభ్యము మోక్షము మొక్షప్రదాతయగు సకల భూతములగు నాత్మేశ్వరుండు తనచేతనైన మహాభూతములోడ జీవుండై యుండును. నిష్కాములై మనుజులు పరబ్రహ్మమును భక్తితో భజింపవలయును. స్త్రీలకు పురు షుండట్టి పరమాత్మస్వరూపుండు గావున పతినే దైవముగ దలంచి షోడశోపచారములుజేయు భర్తృపదారవింద ధ్యానము మోక్షమని దలంచిన పుణ్యలోకంబు సిద్ధించునని చెప్పి యంతర్ధానమొందెను.

ఇదంతయు సావధానముగా విని సుమతి మిగుల సంతుష్టురా లై యింటికివచ్చి భర్తను ధ్యానించుచుండగా కౌశికుండు మరునాడు దయమున వారకాంతయింటినుండి తన స్వగృహంబునకు వచ్చి దురా చారపరాయణుండై ధనము వ్యర్థముగా ఖర్చుపెట్టుచుండ కొన్నాళ్లకు అన్నవస్త్రాదులులేక మిక్కిలి యిబ్బందిపడి యొకనాడు భార్యంజూచి ఓసీ దుష్టురాలా! నీవెల్లప్పుడును అతిథులకు అభ్యాగతులకు బెట్టి కొంప నట్టేటిలో గలిపి తుదకు నన్నీగతిజేసినావు. అందువలననే నీ వూరబోయి బిచ్చమెత్తుకొని జీవించెదను. నీవెక్కడికిబోక జాగ్రత్త గా నింటనుండుము అని చెప్ప సుమతి నాథా! నిన్నువిడచి నే నొం టరిగా నుండలేను. మీరు మిగుల కష్టములుపడుచుండ నే నింట సుఖములు అనుభవించుచుండిన నాది యొక జన్మమేనా? మీరెచ్చ టికిని బోవలదు. మీరింటనుండుడు నేను గష్టపడి మిమ్ము పోషించెద

నన ఛీ నిర్భాగ్యురాలా ! నామాటల కడ్డము సెప్పి నా ప్రయాణము నాపు జేసితివి అని నోటికివచ్చినట్లెల్ల దూఱి యిక నామాటవలంచి నచో నిన్ను నతికివేసెదనని చెప్పి యర్ధరాత్రమున లేచి యామెతో జెప్పకుండగా యిల్లు విడచి దుఃఖించుచు దేశాంతరమునకు పోయెను. కొంతవడికి సుమతిలేచి మగనింగానక కటకటా భర్త నన్నొంటరిగ విడచిపోయెనే యని చింతాసాగరమున నీదుచు అడవిలోనుండి ప్రయాణముసేయుచు మగని వెదకుటకై పోయెను.

ముందుగఁబోయిన కౌశికుండు ఆకలి కోర్వలేక కొన్ని ఫలముల నారగించి యడవిత్రోవను బట్టి భార్యవచ్చుచున్నదేమో యని వెనుకకు దిరిగి చూచుచు బోవుచుండ నార్వురు దొంగలాతని గాంచి ఓరీ నీవెవ్వడవురా ! నిర్జనారణ్యమగు నీప్రదేశమున యేలగు త్రిమ్మరుచున్నావు ? నీవు మాతో గూడ దొంగతనమునకు రాకుంటివేని నిన్ను బొడిచి చంపెదమనగా నా కౌశికుండందులకి య్యకొని వారితో కూడ వెనుకకు వచ్చుచుండెను.

ఈకథ యిట్లుండ సుమతి వనములఁ తన భర్త నన్వేషించుచు వచ్చుచుండగా దొంగలతో గూడి వచ్చుచున్న మగడెదురు వచ్చెను. ఆతని జూచి నమస్కరించి సుమతి యా దొంగలం బ్రార్థించి తన భర్తనువిడిపించుకొని వెంటఁబెట్టుకొని పోవుచు నాథా ! నన్ను విడచి కాననముల కేగుట నీకు పాడియేనా ? ఇకనైన నన్ను గటాక్షించి మనయింటికి పోదము రమ్మన నాదుర్మార్గుడు తిరిగి మిగులకోపగించుకొని కాలు బూతులు ప్రేలి రక్తంబుగారునట్లు ఆమెను గొట్టి యొక్క వృక్షంబునకు గట్టివేసి తిరిగి తలపై గుడ్డవేసికొని పోవుచుండెను. అప్పుడైననామె యించుకేనియు కోపమును జెందక మహాయోగనిష్టాగరిష్టునివలె యేమియును జేయలేక భర్తపదారవిందధ్యానము సేయుచు నట్టెనిలిచియుండెను.

అంత గొంతవడికి సుమతి పతిభావముచేత దైవమా యడవి లోని ఎఱుకలవారిని ప్రేరేపించగా వారు వచ్చి యామెచే వర్తమాన మంతయు విని నాపుకమి దయ్యము నయ్యరణ్యమున వెదకి పట్టుకొని సుమతి కట్టబడియున్న యవనిజము వద్దకు లాగుకొనివచ్చి యాతనిచే నామెకట్లు విప్పించి యికనైన నీ భార్యను దీసికొనిపోయి సుఖం బున యింటనుండుము. నీవీ యరణ్యమున తిరిగి మాకు గనుపించిన చో నన్ను తప్పక నఱికెద మని భయపెట్టి తమదారిని బడి పోవుచుం డిరి. అంత నవ్విప్రుడు ఆహా! దొంగలచేతను యెఱుకు వాండ్రచే తను గూడ పరాభవింపబడితిని. ఛీ, ఛీ, ఇట్టి నాజన్మమెందుకు! అని భార్యను బిలిచి సఖీ ఇక్కడినుండి యెక్కడికి బోదము? మన భోజనమున కుపాయమెద్ది? యని యడుగ ప్రాణేశ్వరా భోజనమునకై మీరు విచారింపనవసరములేదు ఇచ్చటి కనతిదూరముననే, నొక బ్రాహ్మణ యగ్రహారమున్నది. నే నా బ్రాహ్మణులయింట వంటజేసి మిమ్ము బోషింతునని చెప్పి యట్లే యగ్రహారమునకు భర్తను గొని పోయి యచ్చట తాను జెప్పినట్లే జేసి భర్తను పోషించుచు సుఖ ముగ కాలక్షేపము జేయుచుండెను.

పిదప నొకనాటిరాత్రి తనపూర్వపుగుణమును విడువలేక కుక్కను దీసికొనివెళ్లి పల్లకిలో గూర్చుండబెట్టితే కుచ్చులన్నియు తెగగొఱికినదను సామెతప్రకారము నావిప్రుడు అయ్యగ్రహారంబున గల వేశ్యయింటికి పోదలంచి భార్యను బ్రతిమాలి యొకరేయి యా వెలయాలియింట జరిపి తెల్లవారకుండగనే లేచి ముసుంగుబెట్టుకొని తిన్నగా యింటికివచ్చెను. ఆనాటినుండియు చలిజ్వరముచేతను, కాళ్లు చేతులు లాగుటచేతను లేవశక్తిలేక మంచముమీదనే బరుండీ దొర్లు చుండెను.

అంత మగనింగని సుమతి తిరిగి విచారమునొంది వైద్యులచేత మందిప్పించెనుగాని యాతని జబ్బు కుదురకుండెను. అట్లు జబ్బుగా నుండియు నాభూసురుడు భార్యనుగాంచి, యింతీ నాకొక్క కోరికగలదు అది నీవు నెఱవేర్చినచో, నే నెక్కడికినిబోక నీవు చెప్పినట్లు నడుచుకొందును అదెద్దియన ఈగ్రామమునకు 10 ఆమడల దూరమునందొక రాజుపట్టణముగలదు. అందొకరాజవీధియున్నది. ఆవీధిచివర దక్షిణపువైపుననుండు నొకగృహంబున మనోహారిణి యను నొకవేశ్యకాంతగలదు. అది మిగుల సందవతిగనుక దాని నాశించియుంటిని. నట్టి ముద్దులమూటను దెచ్చి యీరేయి నాకప్పగించినచో మఱి యెక్కడికి లేచిపోననెను.

ఇదంతయు విని యాసుశీల మనసుగోపముగాని చిరాకుగాని లేక తిన్నగా యొరులనడుగుచు దారిదెలిసికొని యావెలయాలియింటికిబోయి దానివద్దజేరి ముద్దుగుమ్మా నీయందమును నామగడు వర్ణించగా వింటెనియనిగొంతసేపు యిష్టాగోష్టి, కష్టము, సుఖము; పిచ్చపాటి; మంచి, చెడ్డ; ఉత్తమము, మధ్యమము; మాటలాడి యావేశ్యకు చక్కగా తలదువ్వి కొప్పుబెట్టి నీయందము నిప్పుడు నిలువుటద్దములో జూచుకొనుమనెను. ఆబోగముదియు తనయందము నాయద్దములో జూచికొని యాబ్రాహ్మణి తయారుగావించిన క్రొత్తయందమునకు మిగులసంతసించి యో బాపనమ్మా నీ సామర్థ్యమునకు నేను మిగుల మెచ్చికొంటిని. నీవెందులకిచ్చోటికివచ్చితివో శీఘ్రమున దెలుపుము. సమకూర్చి పంపెద నన యా సుమతి యిట్లు చెప్పెను. ఓ పల్లవపాణీ నాభర్తయెప్పుడును పరస్త్రీ సాంగత్యము జేసిన వారుకారు. ఎందుచేతనో నీపై భ్రాంతిగొని యీ రాత్రి నిన్ను పొందదలంచి యెట్లైన నిన్నొప్పించుకొని రమ్మని నన్ను బుత్తెంచినారు. గావున

యెట్లైన పుణ్యముగట్టికొనుమని ప్రార్థింప నావెలయాలు సరే నీమగనినావద్దకుగొనిరమ్ము అని పంపించెను. అంతట సుమతి యపరిమితానందకందళిత హృదయారవిందురాలై నేరుగా యింటికిపోయి భర్తనుగాంచి ఓ ప్రాణనాయకా మీకోరికప్రకారమంతయు సిద్ధముగావించితిని యామెపోయి మిమ్మునల నచ్చోటికి దీసుకొని రమ్మన్నదని చెప్ప నాబ్రాహ్మణుండును సంతోషసాగరమున నుండెను. పిదప సుమతి రోగియగు తనభర్త నొక గంపలో గూర్చుండ బెట్టుకొని కటిక చీకటిలో నాగంపను తన తలమీద బెట్టుకొని మోసికొనిపోయి యా వేశ్యయింటియందు దింపి ఇతడే నాభర్తయని చెప్పెను.

ఆవేశ్యయు నాతని జూచి మిగుల విచారించి ఆహా నేటిరాత్రికిట్టి కురూపి సంప్రాప్తమాయెగాబోలునని తలంచి యాతని కోర్కెదీర్చి భార్యయగు సుమతి కప్పగించెను. ఆసుమతియు తిరిగి నాతని నాగంపయందిడుకొని యింటికిబోవుచు మార్గము తప్పి మాండవ్యమహాముని యుండు సంగతి యెఱుగక యాగంప నాతనికి దగిలెను. అందుల కాముని మిగుల కోపగించుకొని ఓహో మగనినెత్తుకొనిపోవు సంభ్రమములో మునిగి కన్నులుగానక తిరుగుచున్నావని శపించె. అందులకు సుమతి ఆహా దైవమా నేను దారితప్పి చీకటిలో యిట్లు దిరుగు చుండుటవలన తగిలినదిగాని మరియొకటి గాదు. నాకిట్టి శాపమిచ్చుట నీకుదగునా నేను పతినే దైవముగ పూజించు చుంటినేని సూర్యోదయము కాకుండును గాక యని ప్రతిశాపంబిచ్చి మగనికి ధైర్యముజెప్పి యింటికి కొనిపోయెను.

ఎంత ధైర్యము జెప్పినను వినక కౌశికుండు తనయింటి విప్రులతో అయ్యా మునిశాపంబున నేనీరాత్రియే జనిపోదును. నాభార్యను పెక్కుకష్టములు పెట్టితిని. ఒకనాడును దీనితో నన్యోన్యముగా

నుండి భోగించి యెరుగ, ఇన్నాళ్ళనుండి యిది గావున నోర్చియున్నది. ఇట్టి గుణవంతురాలితో నొకనాడును రమించి యెఱుగను. కటకటా దీని నొంటరిగ విడిచిపెట్టి చావవలసి వచ్చెనే. దీని కిక మీ రేదిక్కు. నేజనిపోయిన పిదప మీరు దీనిని మీపుత్రికలలో నొక్కతెగా నలంచి కాపాడుచుండ వలెను సుమీ! అనిచెప్పి దుఃఖించుచుండెను. అట్టి దుఃఖించు మగనిని జూచి నాథా మీ రేల దుఃఖపడెదరు? మీ కేమి యును భయములేదు అనిచెప్పి యింటివారినిజూచి అయ్యా మునిశాప మునకు ప్రతిశాపంబిచ్చి యుంటిని గావున నెప్పటికిని తెల్లవారదు. దృష్టాంతము చూడుడన వారుమిగుల ఆశ్చర్యము జెందిచూచుచుండ ఎనిమిది అహోరాత్రము లేక రాత్రియై యుండె నందులకు వారమ్మహా పతివ్రతాశిరోమణిని మిగుల గొనియాడిరి.

ఇట్లుండ త్రిమూర్తులును, సురలును, మహర్షులు మొదలగు వారందఱు మిగుల సంగారుజెంది ప్రాణులఘోష వినలేక సుమతీదేవి వద్దకువచ్చి, అమ్మా! నీపతివ్రతా మహాత్మ్యమునకు మిగుల మెచ్చితిమి. సూర్యు డుదయింపనందువలన జీవకోటి కృశించుచున్నది. పైరుపత్సలు క్షీణించుచున్నవి. కాబట్టి ఇప్పుడైన సూర్యోదయ మగునటుల శాప మును త్రిప్పివేసి లోకమును మమ్మును ఉద్ధరింపుము అని బ్రతి మాలిరి. అంత సుమతి వారికి నమస్కరించి అయ్యా నాకు నేడు మీ దర్శనమబ్బినది. నాకంతేయే జాలు నికయేమి గావలయును? మాం డవ్యమహాముని నన్ను శపించగా నేను ప్రతిశాపం బిచ్చితి నంతియే గాని వేరుగాదు. అనిచెప్పి తిరిగి యెప్పటివలె సూర్యోదయ మగు గాక! అని పలుకగానే తక్షణమే యినుడుదయించి యెప్పటియట్ల తనపని గావించుచుండెను. అంత నాబ్రహ్మాది దేవతలు అమ్మహాపతి వ్రతాశిరోమణి నాశీర్వదించి బ్రాహ్మణునకు దీర్ఘాయువిచ్చి అష్టైశ్వ

ర్యంబులు గలుగునటుల దీవించి పలికి యంతర్ధానమైరి. అంత నా బ్రాహ్మణ యగ్రహారికులు సుమతి నెంతయుకొనియాడి పతిభక్తికి మెచ్చి కొని వారి ననేకవిధముల బొగడిరి. అప్పటినుండియు సుమతి పతియగు కౌసికునితో సమస్త సంపదల ననుభవించి పిదప కొన్నాళ్ళకు మోక్ష పదవినంది వైకుంఠమున కేగెను. గావున స్త్రీలు తమభర్తలను దైవ సమానులుగ పూజించిన సుమతివలె వైకుంఠమునకు బోగలరు.

సుమతీదేవి చరిత్ర సమాప్తి.



# 20. సురభీదేవి చరిత్రము.

వేలకొలది సంవత్సరముల క్రిందట సువర్ణపురమను పట్టణమున నొక విప్రోత్తముడు గలడు. అతనికి సకల విద్యానైపుణ్యా రాలును మిగుల సుగుణవతియునగు నొకపుత్రికగలదు. మనకథానాయకురాలు ఆమెయేకావున పేరు మీకే తెలియును. అట్టిబాలిక తండ్రినొకనాడిట్లు అడిగెను. జనకా స్త్రీలెట్టికర్మములు జేయుటవలన శాశ్వతైశ్వర్యమగు మోక్షపదవినిబొందెదరు? అంనునకా భూసురుడిట్లు జవాబిచ్చెను: "కుమారీ! స్త్రీలకు లోకంబునకుగల వ్రతములన్నిటియందును పతివ్రతమే మహా గొప్పవ్రతము. అట్టివ్రతావలంబనము వలననే నారీమణులకు పుణ్యము సిద్ధించును. అని పలికిన విని యాతని కుమారి తండ్రీ అట్టిపాతివ్రత్యమేలాగున సంపాదించగలమో? యీజీవునకు మోక్షపదవి యెట్లులభించునో చెప్పుమని వేడెను. గావున తండ్రి యిట్లు చెప్పదొడంగెను. పుత్రికా రత్నమా! యోగములో మృదువు, మధ్యము, అధికము అనిమూడు విధములు. ఇవి యొకదానికంటె మరియొకటి ఎక్కువగానుండును. ఈశ్వరుని ప్రార్థించువారు మంచికర్మముల నాచరించి భక్తితో నీశ్వరుని గొలుతురేని యోగమును త్వరలో సిద్ధింపజేసి కొనగలుగుదురు. పుణ్య పాప కర్మములు, ఆయుర్భోగములు మనస్సునందు నాటియుండు సంసారములు. వీటిచేతగాని కాలత్రయములచేతగాని బాధనొందని వాడే యీశ్వరుడు. అట్టి యీశ్వరుడు సర్వజ్ఞుడు. బ్రహ్మాదులకు గూడగురువు. ఓంకారతపమువలన పురుషునియొక్క విఘ్నములు శీఘ్రముగా తొలగిపోవును. జ్ఞానమలవడును ఈశ్వరధ్యానమువలన ఆత్మసాక్షాత్కారమెటుల కలుగునని ఈశ్వరుని ధ్యానముతో ఆత్మ స్వరూపంబునె యుండుటంబట్టి యీశ్వరోపాసన

వలన ఆత్మ స్వరూపంబు తెలియును. అమ్మా ! మరియు పతివ్రతా ధర్మముమిగులగష్టము. అయిననునీవు మిగులబుద్ధిశాలివగుటవలనజెప్పెదవినుము. యింతులకు పతులే భర్తలు. అట్టిభర్తను పరబ్రహ్మముగా దలచి నాతనికి షోడశోపచారములను జేయుచు పతికిజేయు నుపచారములే దేవునికి జేయునుపచారములని భావించి యెల్లప్పుడును భర్తపదారవిందములనే పూజించుచు నుంటివేని త్రిమూర్తులుగూడ నీకు ప్రత్యక్షమగుటకు సందియముగాన్పించదు.

ఈ మాటలన్నియు సావధాన చిత్తురాలై విని ఆ సుమతి అపరిమితానందకందళిత హృదయారవిందురాలై అహర్నిశములు తండ్రి యుపదేశములనే దలంచుచుండెను. అటువెనుక నొక్కనాడా పుడమి వేల్పు నింటికి అగ్నిదత్తుడను నొక విప్రుడు మార్గవశాత్తుగావచ్చి ఆయింటివారింగని అయ్యా నాకింత భోజనము పెట్టెదరా ? మిగుల ఆకలిగానున్నది అని అడుగ ఆపారుడవ్విప్రకుమారుని అన్న పానీయంబు లిచ్చి సేదదేర్చి వాని వృత్తాంతంబున విచారించి యాతడు, మంచి కుటుంబములోనివాడనియు,బ్రహ్మచారియనియుశాస్త్రవేత్తయనియు ఆచారముగలవాడనియు విద్యావంతుడనియు దెలిసికొనితనపుత్రికయగు సుమతినాతని కీయమనస్సున సంకల్పించుకొనితనపత్నివద్దకుబోయియీ వృత్తాంతమంతయు నామెకు జెప్పి వీనికి మనబిడ్డనిచ్చి వివాహము జేయవలెననియున్నది. ఇందునకు నీవేమనెదవన ఆమెయు నందులకు సరే మీయిష్టము కానిండనెను. పిదప నాపుడమివేల్పి వర్తమానమా బ్రహ్మచారి యగు అగ్నిదత్తుని చెవినివేసెను. అగ్నిదత్తుడది విని అయ్యా, మిగులసుగుణవంతురాలును, ఆచారవంతురాలును, విద్యావతియును, నగుపత్ని సమకూడినచో వివాహము చేసికొనుట యుచితమేకాని, దుష్టురాలు, విద్యావిహీనురాలు అజ్ఞానియునగు వెలదిని గట్టుకొందునేని యిక నరకము వేరే అక్కరలేదు. పడంతుల హృద

యంబు లెఱుగ నెవ్వరితరము. గావున నేను మీకుమార్తెను మూడు ప్రశ్నలడిగి చూచెదను. వాటికి తగినజవాబు లిచ్చినచో తప్పక యామెనే కళ్యాణము గావించుకొందును అని పలికెను.

దాని కొప్పికొని యాబ్రాహ్మణుడు తనకుమార్తెను రప్పించగా అగ్నిదత్తుడామెసౌందర్యమునకు మెచ్చికొని యామెంజూచి నారీరత్నమా! స్త్రీలకు నీచమేది? గొప్పయేది? ఆభరణమేది? అని అడిగిన నయ్యింతి విప్రకుమారాయింతులకు యిహాలోకమందలి భోగమే నీచము; జ్ఞానానందమే గొప్ప; పాతివ్రత్యధర్మమే యాభరణమనియు జెప్పెను. అందుల కవ్విప్రుం డెంతయు సంతోషించి యా సురభిని వివాహము గావించుకొని గొన్నిదినంబు లత్తవారింటియందే యుండెను. సురభీదేవియు పెండ్లియైనది మొదలు సర్వకాలసర్వావస్థలయందును భర్తనే దైవముగనమ్మి పూజించుచు యతనినామమే తిరునామమని స్మరించు షోడశోపచారములు జేయుచు ప్రొద్దులు పుచ్చుచుండెను.

పిదప నొకనాడు సముద్రుని కుమార్తెయగు సరసయను కన్య, పురుషుడు కావలసి తన సఖులగు మొసళ్ళను చేపలను వీక్షించి సఖులారా! సకల విద్యాతత్పరుడును, బ్రహ్మజ్ఞానియు, మంచి వయస్కుడు, మిగుల రూపరియు నగు నొకపురుషుని చంద్రగ్రహణము రాకముందే వెదకి తీసుకొనిరండు,, అని ఆజ్ఞాపించెను. అవియు సరియే యని సముద్రముపొడవున గల యొడ్డుల కెవరేనియు వత్తురా యనిగని పెట్టుకొనియుండినవి. అంతమనచంద్రదత్తుడాచంద్రగ్రహణము నాడేస్నానము జేయుటకై సముద్రతీరమునకుబోయెను. భార్యయుబంధు మిత్రులును కూడనుండిరి. అంత చంద్రదత్తుడును సురభియు గూడ గొంగుముళ్ళు వేసికొని సముద్రమునందు మునిగిరి. వెంటనే యొక

మొసలి వచ్చి కొంగుముళ్ళను తెగగొట్టి యావిప్రుని గొనిపోయి సరసయెదుట బెట్టి తల్లీ నీవుచెప్పిన గుణములన్నియు గల పురుషు డితడే యనిచెప్పెను. ఆసరసయు నాతని రూపురేఖావిలాసలను చూచి మోహించి వెంటనే గాంధర్వవివాహంబుగావించుకొని చంద్రదత్తుని అక్కడనుండి పోనీయక సమస్తభోగము లనుభవించుచుండెను.

ఆకథ యట్లుండనిండు. సముద్రములో స్నానము జేయుటకు మునిగిన సురభీదేవి యొడ్డుకువచ్చి తనతోడ మునిగిన పతినిగానక కొంగుముళ్ళు జూచుకొనగా నవి కోయబడియుండెను. అంత నామె మిగుల భీతిల్లి అయ్యో నాపతిని నీళ్ళలో మొసలియో లేక మీనమో యీడ్చుకొని పోయినది నేనేమి చేయగలను భగవంతుడా అని దుఃఖించుచుండెను. అదిగని బంధువులందరు కుయ్యో! మొఱ్ఱోయని వలవలయేడ్చుచు గుంపులుగుంపులుగా వచ్చి యాసురభిని గట్టిగా పట్టుకొని తల్లీ దైవయత్నమున కెవరేమి చేయగలరు? మన యత్నమేమున్నది. యను వేదాంతపు మాటలనామె నూరడిల్ల జేయుచు గృహంబునకు రమ్మని కోరిరి గాని. ఆమె దుఃఖసముద్రమున మునిగి యుండియు ధైర్యలక్ష్మిని వీడక వారితో బంధువులారా! నాభర్తను సముద్రుని పాలుజేసి నేనే మొగము బెట్టుకొని మీతోరాగలదానను? ఈరత్నగర్భుని కండకావరమణచి యాతని సఖులను భృత్యులను పలుబాములబెట్టి నాప్రాణేశ్వరుని గల్సికొని మరివత్తును గాని భర్తను వీడిరాను అని చెప్పి మరియు నేను నాజనకుడు జెప్పిన యొకకథను మీకు దృష్టాంతరముగా జెప్పెదను వినుడని యిట్లు చెప్పగడంగెను.

పెక్కువర్షములక్రిందట నొక యెఱుకలవాడొక సముద్రపుటొడ్డున నీలాంబరి యను భార్యతో గాపురముండె. నీలాంబరి తన

భర్తను దైవసమానునిగ బూజించుచు, షోడశోపచారములు జేయుచు, నతని మనంబును సంతోషసాగరమున నీదులాడించుచు, బంధువర్గముచే నిర్లక్ష్యము చేయబడినదైనను తన బిడ్డలతో సుఖంబుండెను. పిదప నొకనాడా బోయవాడు చేపలవేటకు పడవమీదబోయెను. అంత నొక తిమింగలము వానిని మ్రింగివైచెను. నీలాంబరి యీసంగతి బంధువుల వలన దెలిసికొని మిగుల దుఃఖించుచు నూరడించు వారిమాటలను ద్రోసిపుచ్చి రత్నాకరముయొక్క దరియందే గూర్చుండి, ధర్మదేవతను గొల్చి తనపాతివ్రత్యప్రభావంబున అగ్నిని ప్రయోగింప నాయగ్ని యాజంతువులనెల్ల మాడ్చివైచి అంతటితో తృప్తినొందక ఆకాశమునకెగసి స్వర్గమునకు బోయి దేవతలను బరిపింపజేయుచుండెను. దేవతలా యగ్నిజ్వాలల కోర్వజాలక దేవేంద్రునితో గలిసిపోయి బ్రహ్మవిష్ణుమహేశ్వరులగు త్రిమూర్తులను గాంచి యీవ్రతాగ్నిని చల్లార్చుమనివేడగా త్రిమూర్తులా నీలాంబరిని బ్రతిమాలి అమ్మా నీవ్రతాగ్నిని జల్లార్చి మమ్ము చల్లగ నుండనిమ్ము నీపతివ్రతాధర్మములకు మెచ్చుకొంటిమి అని యామెను వేయినోళ్ళ బొగడి యాబెస్తవానిని తిరిగి జీవింపజేసి సముద్రము నెప్పటివలె జేసి యందలి జంతువులను బ్రతికింపుమని ప్రార్థించిరి. అందుకా పతివ్రత సముద్రము నెప్పటివలెజేసి జలజంతువులను జీవింప జేసెను. అంత త్రిమూర్తులును దేవతలును యామెను మిగుల పొగడి తమ తావులకుం జనిరి. ,,

కావున నేనును నాభర్త జీవించు వరకు యిచ్చటనే యుందునని సురభిజెప్పగా యాచుట్టములింటికేగిరి. అంత పతిపదారవిందంబులు మనస్సున నిడి అగ్నుల గల్పించి తన వ్రతయోగాగ్నిని గూర్చి విస్తరింపజేసి అట్టి అగ్నిహోత్రంబులచే సముద్రమందలి నీటియం

దలి నీటినంతను బీల్చి అందలి జంతువుల కెక్కువ యుపద్రవమును కలిగించుచుండెను.

పిదప నాసంగతులన్నియు నా దేశపురాజు విని రత్నాకరము వద్దకుబోయి మిగుల నచ్చెరువొంది, ఆమెకు యెండ వేడిమి తగుల కుండ పందిళ్లు వగయిరా వేయించి కొందరి నౌకరుల నామెకు కావలి గానుంచిసమాచారమప్పుడప్పుడు తెలిసికొనుచుండెను. ఇట్లుండ నాసురభి పతివ్రతాప్రభావముచే వ్రతాగ్ని పైకెగసిసముద్రముపైబడిసముద్రము నంతయు నల్లకల్లోలము గావించుచుండెను. అంత జలధి యాబడబాగ్ని కోర్వలేక భృత్యులవలన జరిగిన వర్తమానంబంతయు విని తనకుమార్తెయగు సరసవద్దకుబోయి అమ్మా నీవు చేసినపనివలన మిగుల ప్రమాదము వాటిల్లి జనులందరును యగ్నితపంబున నోర్వలేకున్నారనెను. నీవెక్కడ? సురభీదేవియెక్కడ? అట్టి సురభీదేవిభర్తను నీవు చేపట్టదగునా? సరే అయినదేదో అయినది, ఇంతటినుండియైన వానిని విడువుము. అని ప్రార్థింపగా నాసరస తండ్రినిజూచి నాప్రాణముతైన నిత్తునుగాని నాపతినిమాత్రము విడువనని పట్టుపట్టుకొని కూరుచుండెను. చివరకు తండ్రి యాసరసను బ్రతిమాలగా నామె నన్ను ఆసురభివద్దికి గొనిపొమ్ము. అట్లయినచో విడుతుననెను. సముద్రుడప్పుడు అగ్నిదత్తుని, సరసుని దీసికొని సముద్రపుటొడ్డుకుబోయి పతివ్రతయగు సురభింగని నమస్కరించి అమ్మా నీభర్త యితడే. తీసుకొనివచ్చితి గావున నీవిక అగ్నిని చల్లార్చి సముద్రమందలి జంతువులను బ్రతికించుము. అని వేడగా యామెకండ్లు దెఱచి చూచెను.

అప్పుడు సరస సురభికిమ్రొక్కిన నన్ను చెల్లెలిగామన్నించుమని ప్రార్థించి యనేక దివ్యరత్నములతో నామెను పూజించి మహోత్సవంబులు సేయించి తమస్థలములకు జనిరి. ఈవర్తమానమును విని నాయూరిజేడు మంగళవాయిద్యంబులతో వచ్చి సురభికి నమస్కరించి

అగ్నిదత్తుని సురభిని యేనుగపై నెక్కించి తనపట్టణమునంతయు మహోత్సవముగా నూరేగించెను. అంత నాసతీపతు లిరువురును చిర కాలంబు సుఖంబున బ్రదికి, ధనకనకవస్తువాహనములతోడను, పాడి పంటలతోను, సిరిసంపదలతోను పుత్రపౌత్రులతోడను కాలక్షేపము జేసి పునర్జన్మారహితంబగు వైకుంఠపదవి నొందిరి. చూచితిరా అన్నా పాపతివ్రతయొక్క ప్రభావము !

సురభీదేవిచరిత్రము సంపూర్ణము.



# 21 సుముఖీదేవి చరిత్రము.

బహుకాలముక్రిందట సింహపురియను పట్టణమొందు గలదు. దానికి పడమటి వైపున పాత్రిపురమను నొకకుమ్మరిపల్లెయందు సాధు హృదయుడను నొక కుమ్మరిగలడు. అతడు మిగుల ధర్మాచారపరాయణుడును సత్యమార్గావలంబకుండును నైయుండెను. ఆతనికి లేక లేక ముసలితనములో నొక్కకుమారీరత్నము జన్మించెను. యామె ముఖమున నొకవిధంబైనకళ యామెకొక విధమైన వన్నెను దెచ్చుచుండెను గావున యామెకు సాధుహృదయుడు సుముఖియను నామధేయంబిడి మిగుల గారాబముతోను వల్లారు ముద్దుగాను బెంచుచుండిరి.

ఆసుముఖియు చిన్నప్రాయంబునుండియు తల్లిదండ్రుల కెంతయు ముద్దుగొల్పుచు శాంతశమదాదిగుణములు గలిగి వారిమాట జవదాటక తనయీడు బాలికలతో గూడి యాడుకొనుచు మిక్కిలి ఓర్పుగలిగి గృహకృత్యముల నెఱవేర్చుచుండెను. అందువలన యూరివారందరు "సాధుహృదయుని కుమార్తె యెంత చెడ్డపిల్లమ్మా! అందరి బిడ్డలవలె గాదు. ఒకరిజోలికి పోదు ఒకరిసొంటికిపోదు తనపని యేమిటో, తానేమిటో అంతేకాన్ని; అయితేకాని యీముసలికాలములో నాతని కీబిడ్డ యెందుకు యేడవడానికి? ఆమె నెవరు పెండ్లి చేసికొందురు. ఎవరితోడను మాట్లాడని యిట్టిబిడ్డ యుండిననేమి పోయిననేమి" అని చెప్పుకొనుచుండిరి.

ఈమాట లొకదినమున నాకుమ్మరివాని చెవినిబడినవి. అందువలన ఆతడు మిగుల విచారమనస్కుడై ఆహా! యీశ్వరా యిట్టి ముద్దుపిల్ల పుట్టకపోయిన బాగుండునే. దీనికి నే బ్రతికియుండగనే

సెవనినో వెదకి కట్టిపెట్టుకున్న దీనిమొగమిక ముందెవ్వరును చూడరు. అని తలంచి తనచుట్టములలో నొకసని రప్పించి యాపిల్లవానికి తన కూతునిచ్చి కళ్యాణమొనరించి తనమగసంతానము లేనందున అల్లునినే పుత్రునిగా నెంచుకొని యాతని నింట నుంచుకొని ప్రేమతో పోషించి కులవిద్యనే నేర్పుచుండెను. అంత గొన్ని దినంబులకు సాధుహృదయుండు ముదిమిచే మృతినొందెను. అంతట నాకుమ్మరి యల్లుడగు మందప్రజ్ఞుడు తన భార్యనుగని, ఓసీ నీజన కుడు జీవించి యున్నంతకాలమును నీవును నేనుగూడ సుఖంబుగ గడపితిమి. మనకెవ్విధమగు లోటును లేకపోయినది. ఇక మనలజూచు వారెవ్వరు. మనమెట్లు జీవించగలము. నీవును మందమతివి. నేనును మందప్రజ్ఞుడను. అయినను మనమే కష్టపడి జీవనోపాయమును గాంచ వలెను. అందువలన నీవు మన బంధుస్నేహితులతోడ వూరి వెలుపల నున్న మడుగునకు బోయి జిగటమన్నును గొనివచ్చినచో నేనదంతయు జక్కపరచి కుండలు దాకలు, మూకుళ్ళు, చట్లు, ముంతలు. కూనలు, కూజాలు బుడ్లు మొదలగునవిచేసి, వాటినమ్మి ఆడబ్బుచే మనసంసా రకృత్యములు జరుపుకొన వచ్చునని పలికెను. సుముఖియు భర్తయాజ్ఞ ప్రకార మట్లే జిగటమన్ను దెచ్చి యిచ్చుచుండెను. మందజ్ఞుడు భాండా దుల గావించుచుండ దానివలన వారి జీవనోపాయము జరిగిపోవుచుం డెను. ఒకదినమున సుముఖి జిగటమన్నుగల గంప నెత్తికొని వచ్చుచు దారిలో నదిమిక్కిలి బరువైనందు నేలంబార వైచి, అక్కడగూర్చుండి ఓభగవంతుడా! యింత బరువును నేను మోయలేను. ఈమట్టి తీసుకొని పోయినగాని రోజుజరుగు నుపాయము లేదు యేమిచేయుదునని యేడ్చు చుండెను. ఆమెతోవచ్చిన చుట్టములు స్నేహితులు యామెను జూడ లేదు. ఆమె పలికిన పలుకులు వినలేదు.

పిమ్మట గొంతవడికి సుముఖి యదృష్టవశమున గౌతమమహా ఋషి యామార్గమున భోవుచుండి గోలున యేడ్చు నాయింతిని గాంచి,

అమ్మా ! యేల దుఃఖించుచున్నావు చెప్పుమని యడిగెను. సుముఖి యాతాపసునికి నమస్కరించి తనభర్తయొక్కయు తనయొక్కయు కష్ట సుఖంబులను దెలిపెను. గౌతముడది యంతయు విని అమ్మా ! నీవు నీవెనుకటి జన్మయందు మునులను పూజించి వారికి నుపచారములు గావించితివి అట్లుండియు యామునులవలన జన్మవిముక్తియగు మంచి సంగతులను నేర్చుకొనలేదు. కాబట్టి నీకిట్టిజన్మసంప్రాప్తమై మిగుల గష్టపడుచున్నావు అనిచెప్పగా విని సుముఖి యాఋషి నిట్లడిగెను. "మునిశ్రేష్ఠా చావు, బ్రతుకు, పుట్టుక, మొదలగునవి లేక జీవన్ముక్తిగలిగియుండు టెట్లోనాకు సావధానముగాజెప్పి నన్ను కృతార్థురాలిని జేయవేడెదను" అని ప్రార్థింపగా నాఋషిపుంగవుడా సుముఖికి అష్టాంగయోగమును జెప్పి; ఓకుశాగ్రమతీ నీవెల్లపుడు మగని దైవంబుగా దలచి యాతనికి షోడశోపచారములు చేయుచు, యాతని నామమే తిరుమంత్రమునలె జపించుచు, సర్వకాల సర్వావస్థలయందును నతనినే స్మరించుచుండిన నీకెట్టికష్టంబులును రాజాలవు ; పరమహంస స్వరూపంబగుపరబ్రహ్మంబునీకు అరచేతిలోని రేగుబండువంటిదె అండపిండబ్రహ్మాండములు మూడును నీవశమున నుండును ; నీవే శుద్ధబ్రహ్మస్వరూపంబగుదువని పలికి తాను తనదారిం బోయెను.

పిమ్మట సుముఖి యతి యుపదేశంబు వడసి పతిని దలంచుచు తిరిగి యాబంకమన్ను గంపను అవలీల తలపైబెట్టుకొని గృహంబునకు బోవుచుండెను. అట్లుపోవునపుడు గంప తలపైనుండక తల కొకయంగుళముపైన వచ్చుచుండెను. అప్పుడామె యింటివద్ద గంపనుదింపి మార్గములో జరిగినదంతయు నామూలాగ్రముగ పతికెఱింగించి పతిపాదములకు మ్రొక్కి వంటయింటిలోనికి బోయి యొక తృటిలో షడ్రసోపేతముగ భోజనమాయత్తముజేసి పతికిబెట్టి శేషాన్నమును తాను భుజించి నతనిమాట జవదాటక దినదినము కావలసినంత మన్ను దెచ్చి

భర్తకిచ్చి యాతఁడు కుండలు జేసినతోడనే వాటిని దన పతివ్రతా ప్రభావమున బుట్టించిన యగ్నిచేతగాల్చి వాటిని బట్టుకొని యూరిలోనికి వెళ్ళి అందందు విక్రయించి శీఘ్రముగ తిరిగివచ్చి మగనికి భోజనం బుబెట్టి గౌతముఁడుజెప్పి పోయిన యోగవిద్యలను మఱువక యభ్యసించుచు, భర్తపాదములనే భగవన్నామ స్మరణవలె జపించి అటు వెనుక భుక్తాన్న శేషమును తిని భర్త కిష్టమగు పనులనే జేయుచుండెను.

పిదప నొక దినమున సుముఖి బంధువర్గపు స్త్రీలను గూడి ఎప్పటివలె బంకమన్నుకై పోవుచుండ దారిలో నొక పెద్ద యేరడ్డము వచ్చి వారిని బోనీయకుండెను. అందువలన కుమ్మర వాండ్రందఱును మిగుల విచారగ్రస్థులై నేడెవరి మొగముజూచితినో యని యొకతె యును, నేడు మనము లేచినవేళ మంచిదిగాదని మఱియొకతెయును, యిట్లు పలువురు పలువిధముల దలంచి విసుగుకొనుచు వెనుకటి త్రోవనుబట్టిరి. అప్పుడు సుముఖి వారలను గాంచి అమ్మలారా మీ రేల వెనుకకుపోయెదరు? నాతోడ భయములేకుండ వెనుకనడచి రండని జెప్పి యామెముందు నడువసాగెను. అంత యేరు అడ్డముగా మధ్యకు రెండుపాయలుగా చీలి యామెకు దారిచ్చెను. అంత కుమ్మరస్త్రీలందరును యామెవెనుక బోయి బంకమట్టిని దెచ్చికొని తిరిగి యింటికి బోయిరి. ఊరివారందఱును యామె పాతివ్రత్యప్రభావమును మిగుల కొనియాడుచు ఔరా! సుముఖి ఎంతటి సామర్థ్యమును సంపాదించెను. చిన్ననాటనుండియు మిగుల ముద్దుగాను మూగగాను నున్న యాసుముఖి కెంతలో యింతసామర్థ్యము గలిగెనని యచ్చెరువొందుచుండ నీవర్తమానము కుమ్మర కులములో పెద్దవాడగు నొకనికి గొందఱు బోయి దెల్పిరి. ఆకులపెద్దయు నాతని భార్యయు నీవర్తమానమును విని మిగుల సంతోషించి ఆసుముఖి ప్రభావమును

బరీక్షించవలెనని మనంబున దలచి కుమ్మరమేస్త్రి యొకదినంబున కొందరు కుమ్మరిస్త్రీలను బిలిచి "సుముఖి యింటికిబోయి యీవూర దేవునికి ఉత్సవము జరుగుచున్నది. పోయి చూచివత్తము రమ్మని మెల్లగా మంచిమాటలుజెప్పి తీసుకొనిరండు" అని చెప్పిపంపగావారల్లే బోయి యామెను బిలిచిరి. అప్పుడామె తన మగనికి యుపచారంబు లొనర్చుచుండెను. అందువలన నామె వారిని జూచి అమ్మలారా! నేను రానీలులేదు. „నాకు దేవుడింటనే యున్నాడు.„ అని చెప్పి వారిని సాగనంపెను. వారుతిరిగి వెడలి యీసంగతిని కుమ్మరమేస్త్రి కెఱింగించగా నాతడత్యాశ్చర్యంబు నొందెను.

అంత మఱియొక దినమున యీదేశపురాజు సుమతీదేవి పాతి వ్రత్యమును విని మిగుల నచ్చెరువొంది ఆమెను బరీక్షింపదలచి తన భృత్యులను బిలిచి యామె తాటాకుల గుడిసెను అంటించి రండని యుత్తరువిచ్చెను. ఆరాజు నౌకరు లవ్విధముగానే నొక యర్ధరాత్రి మున జని యాభార్యాభర్తలిరువురు గానముగ నిద్రబోవుచున్న సమయమున నాగుడిసెకు నిప్పంటించి తక్షణమే యీవార్తను రాజు నకు విన్నవించిరి. అంత నాగుడిసె గాలి మంటలు పొగయు వ్యాపింప మంద ప్రజ్ఞుడు మొదటమేల్కాంచి మిగుల కంగారు పడి తన భార్య ను గాంచి తట్టి లేపి అయ్యో! మన గుడిసెకు నిప్పంటుకొని కాలి పోవుచున్నది లెమ్ము లెమ్ము అని లేపగా నామె ప్రాణేశ్వరా! భయ పడకుము అనిపంచాక్షరీమంత్రంబు జపించి వెంటనే వర్షంబు గురిపించి అగ్నిహోత్రముచు జల్లార్చెను. అది గని మంద ప్రజ్ఞుడును, జేడును, యూరి అమ్మలక్కలును ఔరా! అంత ముద్దు యింతకార్యము జేయ గల్గినదిగదా! యని ఆశ్చర్యపడిరి.

పిమ్మట మఱియొక దినమున మామూలుగా సుముఖి కుండల గంపను తలపై బెట్టుకొని తోడియాడు వాండ్రింగూడి యావూరి

యందు కుండలమ్ముటకు బోవునపుడు కుండలగంప యామెతలకంటక తల తిన్నగాకూడ వచ్చుట యావ్వారి మంత్రిజూచి ఔరా యిదేమి వింత ! కుమ్మరవీధిలో వచ్చు ఆడువాండ్రందఱి తలలమీాద గంపలు తలలనంటి వచ్చుచుండగా యాస్త్రీ తలపైగంప తలనంటకయే వచ్చుచున్నదని యచ్చెరు వొంది తక్షణమే రాజునుబిలిచి రాజున కావింత జూపించగా నాతడు తన సౌధాగ్రమునుండి యావింత జూచి ఔరా ! యిదేమాశ్చర్యము చిన్నప్పటినుండియు మొద్దువలె సంచరించిన నీకుమ్మరి పిల్లకింతనేర్పరి తనము ప్రభావము యెట్లుగలిగెను. అని తనలో దానాశ్చర్యపడి మంత్రినిగాంచి ఓమంత్రి దీనిమాయను బాగుగా మనము బరీక్షించవలెను. అని చెప్పి యొకదినమున రాజు తన భార్యంగాంచి సఖీ కుమ్మరసుమతి యిచ్చటికి కుండలు అమ్ముటకు వచ్చినపుడు నీవు బేరమాడి పుచ్చుకొని సొమ్మునివ్వక కాలక్షేపము చేయుము. అది తన మగనికి సరిగా రెండు యామములకు అన్నము పెట్టునట ఇప్పుడెట్లు పెట్టునో చూతమని చెప్పి యీఆలోచన తన మంత్రికి గూడ తెలియపఱచెను. అంత మరుసటిదినమున నాకుమ్మరి దానిచే కుండలు దెప్పించి రాజు భార్యనద్దవిడిచిరి. అంత నాపట్టపు రాణి భాండంబులను బేరమాడి పుచ్చుకొని వాటిసొమ్ము నివ్వక కాలయాపనము జేయుచు ,,సుముఖీ నిన్ను జనులందరు చిన్నప్పటినుండియు మూగదియనియు మందమతియనియు జెప్పుకొనుచుండిరి గదా. ఇంతలోనే నీకీ విచిత్రకార్యములను జేయుశక్తి యేలాగున కలిగెను ? దయచేసి నాకు కొంచెము చెప్పుమమ్మా ,, అని అడిగిన నామెయు పతివ్రతలుండ వలసిన రీతులను గూర్చి ముచ్చటగా జెప్పుచుండ నారాణియు మిగుల శ్రద్ధగా వినుచు కాలముగడుపుచుండెను.

కొంతసేపటికి సుముఖి రాజు భార్యనుగాంచి అమ్మా చాలా ప్రొద్దుబోయినది. యింటియందు నామగడు మిక్కిలి యాకలిగొని యుండును. నేను వేగముగ నింటికి జని అన్నమువండి నాభర్తకు వడ్డింపవలయును. నాభాండములకియ్యవలసిన పైకమిచ్చి నన్ను శీఘ్రముగ బంపుమని కోరెను. అంత నారాజుభార్య యిదిగోయిచ్చెదను. ఆదిగో

యిచ్చెదను. అని కాలక్షేపము జేయుట దలంచి, సుముఖి యిట్లు ప్రతిజ్ఞ బట్టెను. నేడు నేను సరిగా రెండు జాములగుసరికి సరిగా నింటికి పోవలెను. అని చెప్పి పతిని దలంచి సూర్యుని నట్లే నిలిపి యుంచెను. అందువలన యే గడియారములో యెప్పుడు జూచినను 11 గంటలే అయ్యుండెను. సూర్యుడిక ప్రయాణమాకసమున జేయక యట్టే నిలచియుండెను. అందువలన గడియారము బీ టయింపీసులు వాచీలు అన్నియు ఆగిపోయినవి. పూర్వకాలమందు గడియారములు లేవని చదువరులు భావింతురేమో అట్లు భావింపవలదు. ఆదినములలో కూడ గడియారము లుండెనివిగాని అవి యీనూదిరివి కావు.

రాజీసంగతి యంతయు దెలిసికొని ప్రొద్దు అట్లే నిలచి యుండుటగని యిదియంతయు నామె ప్రభావమేయని గ్రహించి యామె పతి వ్రతా ప్రభావమునకు లోన మిగుల సంతసించి యామె కేవలము శుద్ధ పరబ్రహ్మస్వరూపమని భావించి తక్షణమే యొక పల్లకి దెప్పించి యందీసుముఖిని కూర్చుండ బెట్టి భేరీమృదంగాది వాయిద్యములతోను బ్రాహ్మణుల యాశీర్వాదంబులతోను నాధన్యురాలిని యూరేగించి ధనకనకవస్తువాహనములు మొదలగు యనేక కానుకలతోను నామెను తన యింటికి బంపించి నామె భర్తను ఆలింగనము చేసుకొని వేనోళ్ళబొగడి అప్పటినుండియు వారికెట్టి లోటును లేకుండ అన్న పానీయంబులిచ్చి జరుపుచుండెను.

అంత నాసుముఖీదేవి తనభర్తయగు మందప్రజ్ఞునితో అనేక దినములు సమస్తభోగభాగ్యంబుల ననుభవించి నూరుసంవత్సరములు మహావైభవములతోను సమస్తసుఖములతోను జీవించి మరణాంతరమున పరమపదమున విచ్చేసిరి. గావున స్త్రీలు తమభర్తలను దైవ సమానునిగ జూచి పూజింపవలెను.

సుముఖీదేవి చరిత్రము సంపూర్ణము.

---

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమండ్రి:—1924.

